# నవరత్న సంజీవి



నవరత్న సంజీవియనంటే — సాధ్యములగని వంటి మానవులకొరకు ఉద్భవించిన మహౌషధరాజము. పిల్లలముద్దు మూటగట్టు ముక్కులకు బొక్కులు బొడిపించి శింగారుచేతురు. ఆశింగారంతయు నీరంగారు నవరత్న సంజీవి రాసిన సంగతి గనుగొనితిరుము. రక్తము స్రవించదు. చీముపట్టదు మున్ను మవసరము లేదు! అదియిదియననేల గాయములకు గండ్రగొడ్డలి. తలబాధ తెగటార్చు వజ్రము. తామరను ధ్వంసముచేయు తావసి. కాలిన గాయములకు విధించు శిరస్త్రము. నొప్పిలేని డాక్టరు. ఊరులేనిరాజా. పదములేని కత్తి. జోడులేని రాతు. ప్రాణములేని పోరాటము. చురుకుగల శూరుడు. రోగముల జయించినవీరుడు. హనుమంతుడు గొనితెచ్చిన సంజీవికన్న ఎక్కువపనిచేయగలిగినది గనుకనే "నవరత్న సంజీవి" యైనది. ఆసేతుహిమాచలపర్యంతము యుండందరు వాడవలసినదే. తత్వభేదంబులు దీనికక్కరలేదు. ఖరీదు 0—4—0 వాడువిధము మందుతో వుంటుంది.

## నవరత్న సంజీవి అందు కంపెనీ

వీరేశలింగం హైస్కూలురోడ్,

ఇన్నీసుపేట, రాజమండ్రి.

# మహాపతివ్రతలకథలు



పబ్లిషర్సు:

సన్ లైటు బుక్కు డిపో,

రాజమండ్రి.

 [వెల రు 1-0-0

# విషయసూచిక




## ౧ అనసూయాదేవి చరిత్రము.

పూర్వకాలంబున సప్త ఋషులలో పేరెన్నికగన్న అత్రి యను మహామహుండు త్రిమూర్తులుగూడ అత్యాశ్చర్యంబును బొందునట్లు మహాతపంబునుజేసి సంకల్పసిద్ధిగాంచి యన్నియాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠంబనియెంచి సుగుణఖనియు, సద్గుణములగనియు నగు ననసూయనుద్వాహమాడి సుఖంబుగ గాలంబుగడుపుచుండె.

అమ్మహాపతివ్రతయు పతియే దైవమని యెంచుచు బతిసేవయే పరమభాగవతసారముగా మదినుంచుకొని పతిఁగొలిచే లోకమనియు, పతియే దైవమనియు పతియే తనకు సద్గతియనియు దలంచుచు నాథుండు మేల్కాంచకమున్నె తానులేచి పతిపాదంబులంటి భక్తిప్రపత్తులతో పాదసేవనాచరించి, తీర్థమాడి, పరిశుభ్రంబులగు నీర్కావిధోవతులధరించి, అనుచితంబులగు నాభరణంబులధరించి, శుచిర్భూతయై మనోవాక్కాయకర్మల పతినిసేవించుచు, భర్తనేకువలేవగనే యాగ్నిని సదను మతివడసి పాకశాలకేగి పచనంబుగావించి అభ్యాగతులకు భక్తి విశేషం బుప్పతిల్ల యతిథి సత్కారపురస్సరంబుగా భర్తకువడ్డించి, భర్తచేవిడువబడిన శేషాన్నమును దానుమెక్కి పరమసాధ్వీత్వమున కాలంబుద్రోయుచుండె.

అంత అత్రికొన్నిదినంబులు యామెయుపచారంబులు దనిసి మిక్కిలి సంతోషించి «ప్రాణప్రియా! నీవునిర్మలమనస్సుతోనాచరించు యుపచారంబులకే నెంతయు సంతసించినాడను. నీకిష్టంబగు వరంబు

గోరుమిచ్చెదననుటయు సంశయలకా సాధ్వీమణి చెచ్చెరనిజనాథునితో నిట్లనియె. " ఎద్దాని వలన సకలమానవ నారీమణులలో మేలుఖనియగునో, ఎద్దానివలన యోగికిసిగూడ నందరాని మోక్షలక్ష్మీస్థానమల వడుచున్నదో, ఎద్దానివలన సురాసురులనుగూడినిర్జింపగల శక్తిగలునో ఎద్దానివలన భార్యభర్తకు హృదయానురాగ లతికయగుచున్నదో, ఏది యీశ్వరాదులకుగూడా యెన్నరాని జంజూటమై గనబడుచున్నదో అట్టిపాతివ్రత్య ప్రభావంబు నన్ను బాయకుండు నట్లనుగ్రహింపుడు.

అనవుడు యతిత్రియిట్లు చెప్పందొడంగె. "యువిదా! సజ్జనలోవిదా ! సుజనసమ్మతమగు పాతివ్రత్యంబునిన్ను బాయకుండుగాక ! అదియెట్లందువేని పురుషునకు పూర్వపుణ్యపరిపక్వమున రామభక్తియు నిశ్చలతత్వంబును గుదురుచుండు. అట్టితత్వంబులో నాత్మారాముండే రాముండై దాండవించు. ఇక ఆత్మారాముండన ప్రకృతికి లింగశరీరము నుబొంది తనువునందుండు పరమాత్ముండు జీవాత్మతోసంబంధము గల్పించుకొని జీవాత్మ నెప్పుడు సంతోషింపచేయుచుండును. పరమాత్మ తనయానందమును దానుబొందుచు జీవాత్మకు ఆనందమును దోహదము గల్పించుచుండును. ఇదంతయు భక్తులయొక్క పరమరహస్యంబుల వేదాంతమార్గములోనున్నవి.

ఇక స్త్రీలసంగతి ఇన్నియేల సాధారణభూతములగు జీవాత్మ పరమాత్మలవిడిచి నిశ్చయముగా నాకారుడనగు నన్ను నీవు పూజింపుచు, నిరాకారునినేను పూజింపునట్లు జేయుంపుచు నుందువేనినీవు భూమ్యాకాశంబు మొదలగు పంచభూతములను త్రిమూర్తులును, సూర్యచంద్రాదులు వేయేల? సమస్తలోకంబులును నీమహాత్యంబునకు వెనుకంజియని యేనాయుద్దేశము. కావుననోకలికీ! భరతఖండమునందుపతివ్రతలున్నారని చాటుటకోయని నీపతివ్రతామొగ్గ వికనవకమున్నే పరిమళించుచున్నది.

అపుడు అనసూయ యత్రిమహాముని తోనిట్లు పలికె. భగవథారాధ నాచింతనాపరులగు తమకు భార్యనగుట నాపూర్వసంచితార్థము గాక మరొండుగాదు. తమయనుగ్రహమేనాకు సర్వవిధములా నూతయగుగాక.

ఇట్లుభర్తను ప్రశంసించి మహాపతివ్రతయు, సుజనమిత్రియు, సుగుణగుణపాత్రియు నగు నాయనసూయాదేవి యాశ్రమంబుననుండి సుఖంబుగా గాలంబుగడుపుచునుండ. నొక్కనాడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర్లు. సరస్వతీ, గౌరీ, లక్ష్మి సమేతులై, వృషభగరుడ మరాళ నారూఢులై మహామేరు పర్వతంబునకేగ నుద్యుక్తులై యేగుతరి మధ్యనీఅత్రియాశ్రమంబుసమీపించినతరి వాహనంబులు చలనంబులుడిగి యాశ్రమప్రాంతములనిలిచె. అట్లువాహనంబులు చలనంబులు లేకనిలిచియుండుటకు కారణంబేమని మదినూహించినవారలై త్రిమూర్తులు యద్భుతాశ్చర్యమానసులై గరుత్మంతుని జేరి ''ఓయీ ! స్వామిభక్తిధురీణా! గరుత్మంతా! యిచ్చట మీరెల్లరు చలనంబు లుడిగి నిలుచుటకు గతంబెయ్యది ? ఇందు నేదేనియు మాహేంద్రజాలముండియుండెనా ? ఇందిరాసుందరులు గలమావాహనంబులనే చైతన్యవిహీనంబులుగా జేయగల మాహేంద్రజాలపు విద్య గొప్పదియే? అనినుడివిన విరించి సిరంబువంచి గరుత్మంతుడు యిట్లు నుడివె

''స్వామీ! త్రిలోకైక పావనులగు త్రిమూర్తులకు గూడా స్తంభింపజేసిన నీమహత్తు నొక్క ప్రతివ్రతామ తల్లిదిగాం గొంచడిని. ఆశ్రమంబు జూడ యన్నివిధముల నేను జెప్పిన చొప్పున నొప్పుచున్నది. ఆయమ పతివ్రతాగ్నిశిఖలే మమ్ముల నిట్లు స్తంభీభూతులంజేసె. కనుక నో దేవరా! ఆమె పతివ్రతాగ్ని జాజ్వల్యమానమై యాకాశంబునంటి మీకును మాకును నడ్డంబుగలిగించిన యాసాధ్వీమతల్లినిం జూచి నమస్కరించి జోహారు లొనరించి వత్తమురండ'' ని దెలిపిన గరుడుని వాక్యంబుల కలరి, నామూర్తిత్రియం బాశ్రమంబు జూచువేడ్క

యత్రియాశ్రమంబు జేరిరి. అట్లు జేరిన త్రిమూర్తులును నాయత్రి యర్ఘ్యపాద్యాది విధుల బూజించి షడ్రసోపేతంబుగ భోజనంబులిడ గుతూహలుఁడై యనసూయ కాజ్ఞాపించ భర్తయాజ్ఞ శిరంబున నిడుకొని, భోజనపదార్థంబులు రుచులుట్టిపడుచున్నట్లు తయారుచేసి త్రిమూర్తులకు వడ్డింపబోయిన నాత్రిమూర్తు లిట్లనిరి.

"తల్లీ! సుగుణకల్పవల్లీ! నీ విట్లు వడ్డించిన మేము యెవగమున్ను భుజించువారముగాము. మాకెవరైతే వడ్డించెదరో వారు వస్త్రవిహీనులై వడ్డించినగాని మేము భుజింపనొల్లము. మాకు సత్కారధర్మముదక్కఁదు. గాన నోయమ్మా! నీ వట్లు జేయంగలదానవేని జేయుము. లేకున్న నిప్పటికీ వడ్డనముగింపు మనుటయు నన నా యనసూయ భర్తయనుజ్ఞ వడసినదై వివస్త్రయై పంచాక్షరీమంత్రముతో బాటు నాథుని మదినిస్మరించి చేతనడ్డన పాత్రధరించినంత మాత్రమున నాత్రిమూర్తులు బాలకులై పాలకొఱకు వెదకులాడుచుండిరి.

అంత నమ్మహామునిపుంగవుండు నీ యాశ్చర్యంబునుగాంచి యబ్బురపడుచుండగా యనసూయ భర్త కిట్లనియె.

"దేవా! నీముగ్గురున్ను నన్ను మానభంగమొనగింప నేతెంచినవారలే గాని సదయహృదయంబుతో మనయింట గుడువవచ్చినవారుగారు. వారు కృత్రిమస్వభావముతో పరీక్షింపవచ్చి పరిభవింపఁ బడిరి. వారి చాకచక్యముచేతనే వారిట్లు బాలకులైరి. పాలనఁజేయవలసినవారు బాలకులైరేని లోకంబులెట్లు నిర్వాహమౌనో? కావున నో ప్రాణప్రియా! దీనికింత యబ్బురపాటు నంగనేల? ఈ బాలకుల నిప్పటినుండి బోషించు భారము నాభుజస్కంధమున నిడుకొనవలసియున్నది; గాన వీరల కుయ్యాలలగల్పించి బువ్వంబు మెక్కించి నిద్రబుచ్చివచ్చెద సెలవిండ"ని భర్తనువేడి భర్తచే యనుజ్ఞాతురాలై యా ముగ్గుర బాలకులనిద్రబుచ్చి తనపనియంతయుముగించిభర్తపజ్జంజేరె.

ఇట్లు గొన్నిదినంబులు గతించ మూర్తిత్రయంబుయొక్క యిల్లాండ్రగు లక్ష్మి, సరస్వతి, పార్వతి యున్నగు పరివార మంతయు కలగుండువడి దిక్కులుపరికించి మక్కువగల ప్రాణేశ్వరులు రాక గానమిం చింతించి, దెసలుపరికించి, బిక్కమొగంబులువైచి, యత్రియాశ్రమంబు కడకేగ నుద్యుక్తులై పయనమై యత్రియాశ్రమంబున సమీపించిరి. అట్లు వచ్చిన మూర్తిత్రయంబు భార్యలంగని “తల్లులారా” యేటి కిట్లు కాలినడకనే దయచేసితిరి? మీరాకచే మద్గృహంబు పావనంబయ్యె. మమ్రొక్కులీడేరె నానోములుపండె. నాయదృష్టంబుఫలించెనని యాదేవదేవుల భార్యల నభినుతించి కూర్చుండ యాసనంబుల గల్పించి వారలనిట్లు ప్రశ్నింపం దొడంగె.

“తల్లులారా! వేదాంతులగు మీ భర్తలే యిల్లోకంబునం గల స్త్రీల ననసూయవంచ జూచుట దేనిన్యాయంబు కంటె స్వభావంబున నన్ను పరిభవింపవచ్చి తామే పరాభవమందిరి. కృత్రిమ భావమే లేకున్న నిట్లు చిన్నబిడ్డలుగా నెట్లు మరు? తల్లులారా! మీరే యానతింపుడు. ఆదిమూర్తులైనంత మాత్రము చేత హద్దులేదా? చూచుడు. మీపతులగణ్యులు చిన్నబిడ్డలై యడ్డాలలో నుండవలసినవారుగా నైరి. అని నా త్రిమూర్తుల భార్యలిట్లనిరి. “తల్లీ! నీమహత్తు సకల సంపత్తుల కాకరంబు. నీమహిమంబు యనన్యమేధా సమున్నతంబు నీ మహాత్మ్యమును దెలియనేరక యిట్లాచరించితి వీరల క్షమించి దొసగులు మన్నించి కరుణించి కటాక్షింపుము. మాపతులరక్షించి పతిభిక్షం దయసేయుము. అన అనసూయ యిట్లనియె.

“అమ్మలారా! మీకమ్మని పలుకులు నామనంబునకు సంతసంబు కలిగించినది. మున్నొక్కసారి నారదమునీంద్రుండు నాశీలంబు పరీక్షింపనెంచి రాళ్ళుదెచ్చి గుగ్గిళ్ళగావేచి యియ్యమనుటయు భర్తయనుగ్రహముగల భామలకెందును నసాధ్యంబులు లేవుగాన నాధుని

యనుజ్ఞచే రాళ్లు గుగ్గిళ్ళుగా మార్చి యిచ్చితిని. నేడిది రెండవ పర్యాయము పరీక్షలు. మానవతియొక్క శీలంబు నేనాటికి గుంటువడదు. కావున నో మానవతి మణులారా! పతివ్రతలై పరమ పుణ్యోపార్జనాసక్త చిత్తులగు భర్తలఁగొలుచుచు మీమీ భర్తల నేలుకొనుడని యాబాలుర నవయావనులఁజేసి వారి చేతుల కందిచ్చె.

కావున నో భరతఖండ భాగ్యరాశులారా! అనసూయా మహాదేవి పతివ్రతయైయ్యో, భగవంతుల పసిపాపలగాఁజేసిన దన్నసంగతిమదినిడి మమకారములఁరోసి పరమపతివ్రతలై దత్తాత్రేయునివంటి పుత్రులఁగని భరతఖండము పరువు నిలిపెదరుగాక!

సంపూర్ణము

## ౨ సీత చరిత్రము.

---

తొల్లి త్రేతాయుగంబున దశరథుండను రాజు అయోధ్యానగరంబును బరిపాలించుచు నిత్యసత్యవ్రతానుష్ఠానపరుండై మూర్తిభవించిన ధర్మదేవతయో యన సకల ధర్మవిచారుండై కాలంబు గడపుచుండె అన్నియుం గలిగినను పుత్రపుత్రికా సంతతి లేకుండు మాత్రమే కొఱతవడియుండుటచే యిక్కలి చింతించి పుత్రకామేష్టి యాగముఁజేసి యందు పాయసంబును ముగ్గురు భార్యలకిచ్చి వారియందు వరుసగా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను నలుగురు పుత్రులఁగాంచి యథేచ్ఛం రాజ్యముఁ జేయుచుండెను.

ఇట్లుండ కౌశికుని యజ్ఞంబు గాచుటకుఁ గౌశికుఁడు వేఁడఁగా రామలక్ష్మణుల యాగరక్షణార్థము బంపఁగా మధ్య నొకశిలరామ పదరజంబుచే నాతియై గన్పట్టుటయుఁ గురుపుంజేరి గురువరా! ,,యీయమ

యిట్లు రాయియగుటకుఁ గతంబెయ్యది యానతీయ వేడెద" నన విశ్వామిత్రుండు "వత్సా! యీమె అత్రియను మహామహునిభార్య ఇంద్రునిచే మోసగింపఁబడిన కతన యీమె శిలాపత్వంబు దటస్థించె. నీవలన తచ్ఛాపంబువాసె. ఇక మీదట తాటకా సంహారంబును, మారీచ సుబాహులవధయునైన యనంతరంబు మిథిలానగరంబునకేగుదమురం"డని యానతిచ్చునంతలో బ్రహ్మాండాకారముగఁ దొకయువతి వచ్చుటయు దాని-బరిమార్చ బ్రోత్సహించుటయు దానిందెగనేసి, మారీచసుబాహుల పీచమడంచి మిథిలానగరంబునకేగ సంసిద్ధులై ప్రయాణోన్ముఖులైరి. ఇకముందు సీత చరిత్రమును దిలకించ పాఠకులుత్సహించుచుందురుగాన సీతచరిత్రమును యథాస్థితి వర్ణించెదము.

తొల్లి త్రేతాయుగంబు వేదవతీ పట్టణంబను నొకపురవరంబు సకలశుభంబుల కాస్పదంబై, శ్రీలకాకరంబై యొప్పారుచుండె. అందు వేదవిదుండను విప్రుఁడు వేదాధ్యయనముఁ జేయుచు సుఖంబుండె. ఆతని కొక్క సురూపసుందరి నుదయంబందె. ఆమెకు వేదవతియను నామకరణముంచి యామెకుకూడా వేదాధ్యయనమే పరమావధిగా వేదమంత్ర పఠనములచేతనే యామెమనంబుగూడా భగవదాయత్తంబగునట్లు వేదవిదుండు చేయఁగలిగెను. ఆమె రానురాను శుక్లపక్షసుధాకరుని మాడ్కి యభివృద్ధిజెంది యఖిలవిద్యలయందు నారితేరి వివాహవయస్కయయ్యెను.

అంత నొక్కనాడు తండ్రి కూతుంజూచి "తల్లీ! నీకు యుక్త వయస్సు వచ్చినది. ఇక చమవుసంధ్యలు విసర్జించి నీచిత్తమువచ్చిన భర్తనొక్కని వరించి పుట్టినింటికిని మెట్టినింటికిని యశంబుగూర్చి మా కీర్తివల్లికను దశదిశల బ్రాకునట్లు చేయుమ" ని గూతునడుగుటయు నామె యిట్లు జవాబొసంగె.

"తండ్రీ! అహరహంబులును నీవు యేరినిగురించి యీ వేద గోష్ఠి ప్రారంభించితివో, ఏమహనీయుఁడు భక్తజనసులభుఁడో, ఎవ్వని నామచింతనముచే సనకసనందనాది మునులు సద్గతినందిరో, ఏవీరు కథలు అనంతచింతా సాగరమును దరింపఁజేయు నౌకయో యట్టి శ్రీమహావిష్ణుని నేనువరించియుంటి. సాధ్యమగునేని నాకుఁగూర్పుము. అసాధ్యమని యాలోచించితివా తపంబున కుత్తరువిమ్ము. అంతియేగాని యితరులను వరింపను. ఇదియే నాప్రతిజ్ఞ" యని నుడివిన వేదవిదుండద్భుతాశ్చర్యమానసుండై తనయ కిట్లనియె.

"అమ్మా! వేదవతీ! నేనహోరాత్రంబులు చింతించినను నాటి నుండి నేటికి నిదర్శనమే వ్యక్తమైయుండగా యట్టి మూర్తిని నీయట్ట యెదుటబెట్టి నీకంట గట్టుటయన్న నాకును యానందసాధ్యమే? కాని వేలకువేలు సంవత్సరములు తపస్సుచేసినను దొరకనియట్టి శ్రీమన్నారాయణమూర్తిని నేనెట్లు నీకుఁగూర్తునా యని చింతించెద బ్రహ్మకైనను లవికాని యాతని సాన్నిధ్యము మనుబోటులు చేరగలుగుదురా? అతని దక్క యింకెవన్నైనను గోరి సుఖంబుండుము. లేదందువా? మహాతపస్సుచేసి శ్రీమన్నారాయణునిఁ బడయఁగలిగితివా యంతకన్న వేరొండుభాగ్యమా? యీ రెండు కోర్కెలలో నీకేదియిష్టమో యది యాచరింపు" మనుటయు నామె యట్లే గానిమ్మని తపస్సునకు బోయెను అట్లు తపస్సునకుఁ బోయి యుగ్రంబగు తపంబాచరించుచుండె.

ఒకానొకసమయంబునఁ బౌలస్త్య బ్రహ్మపుత్రుండగు రావణుండు విషయాలోలుండై నొక్క పర్వతంబునకు జని యచ్చట యానెకడనుండుటచే విఫలమనోరథంబులో యింటికి వేంచేయుచుండెను. ఆమధ్యదారి యందుగల పర్వతమునందు బాలచంద్రునిఁ దలఁదన్ను సోయగముఁగల వేదవతీ మౌనముద్రదాల్చి తపంబాచరించుచున్నదానింగని మోహాన్ధ

దుండై గవయనుంకించిన వేదవతి పరుని మేను పోకప యీతను వేలయని యశువుల విడుచుటయు, యీసహాసము యంగీకార సూచకమే యని యెంచి యామెను రథంబుపై నిడుకొని యేగుతరి నారదుండాదారి నేతెంచుచు ‟ఓయీ! వెఱ్ఱిరావణా! ఇదేమోయీ! చచ్చినశవమును రథంబుపై నిడుకొని మోసికొని పోవుచుంటివి, యని నుడువుటయు యా కళేబరంబును యచ్చోటనుండి నిసవనేయుటయు నదియొక కొలనిలో

యచ్చటి శిశువుగా నొకటి సరసిజంబులనూ కొట్టుకొనుచు వచ్చుట కనుగొని యాబాలనెత్తి రావణుని కొలువు కూటమునకు దెచ్చి యాసార్వభౌముని యెదుటఁ బెట్టెను. అంతంత యీబాలను జూచుచుండగా ‟సీత పుట్టి లంకను చేటువచ్చె" నని యంబరవీధిని యాకాశవాణి బలుకుటయు యాబాలను జంప నుంకించిన మంత్రులు వారించి యామెనొక పేటికయందు భద్రిపరచి సముద్రమునందు విడిచి పుచ్చిరి. ఆపేటిక తిన్నగా మిథిలానగర పరిసరప్రాంతమును జేరి యొకచెట్టు వేళ్లలోఁ జిక్కి యుండిపోయె.

అంతగొన్నింత కాలమేగినతరి జనకుడు వ్యవసాయము నాచరించుతరి నాగటి చాలున లభించిన దగుటచే ‟సీత" యను నామకరణముంచి సాకుచుండె.

అట్లుండ గొంతకాలమునకుఁ గౌశికునిఁ జన్నముఁ గాచిన శ్రీరామమూర్తి మిథిలానగరంబున కేగుదెంచి హరవిల్లు విరచి సీతను బెండ్లాడి, సీతతోబుట్టువుల వస యన్నదమ్ములను నుద్వాహంబు చేయించి, యయోధ్యకు వచ్చుచు మధ్య పరశురాముండాక్కొని యాతనికి గర్వభంగముఁజేసి. యయోధ్యకువచ్చి సుఖం బుండిరి.

ఇట్లు కాలంబు గడపుచుండ ముదుసలి యగుటచే దండ్రి దశరథమహారాజు రామునకుఁ బట్టాభిషేకము గావించ యత్నించి పురంబ

లంకరించుట మంథరయను తొండరగల యువతి కైకేయి కడకేగి రామపట్టాభిషేకమును గూర్చి విపరీతార్థములతో వివరించి కైకేయి మున్ను త్రిపురాసుర సంహారమునందు కోరిన వరములను యడుగునట్లు జేసి దాను మెల్లగా యింటికిందారి పెట్టె.

దశరథుండు కైకేయింగని యామె యడుగుటకు కారణంబారసి మున్ను తానిచ్చిన వరంబుల నిచ్చెదననుటయు నామె యిట్లు కోరుకొనెను. "దశరథ మహీపాలా! రెండు వరములలో మొదటిది మత్పుత్రుండగు భరతునకు పట్టము గట్టుటయు, రెండవది రాముండు నారాజినో వత్రులు ధరించి యుగ్రవనాటవులం జేరుటయునే. ఇందును పిసమేమియు దప్పింప వీలులేదు. ఇష్టమయ్యెనేని యిచ్చెదననుము. లేకున్న నీయానను మానుటయు దశరథుండు కొయ్యబారి యిట్లు బలికె.

తప్పె! భరతునకు పట్టాభిషేకమే చేసెదను. గాని రామునకు యరణ్యవాస మేలనుకు? దయయుంచి యాఖరుకోర్కె వీడు మనుటయు యందులకు కైకేయి సమ్మతించక పట్టుదల జూపించుటయు రాముండు తల్లి కోర్కె దీర్ప వనాటవులకు సీతాలక్ష్మణ సమేతుండై యేగె.

అట్లు చని మహాసీయులగు ఋషుల దర్శించుచు వారలచే సద్ధర్మముల వినుచు, పుణ్యక్షేత్రముల స్నానంబులం జేయుచు కొంత దవ్వరిగి యచ్చట పర్ణశాల యేర్పరచుకొని యందు వసింపుచుండగా శూర్పణఖ యను యువతి వచ్చి లక్ష్మణునిం గోరుటయు యాతండు దాని ముక్కుచెవులం గోసిన యుగ్రమూర్తియై యన్నలగు ఖరుడు, దూషణుడు మొదలగు రాక్షసుల కోటానకోట్లు బంపించుటయు వారి నందర రాముం డొక్కడే యుక్కడంచుటయు, యవ్వార్తలం కాధీశుండగు రావణాసురునకు సీత సురూప సుందరత్వముల వర్ణించి చెప్పుటయు రావణుండు మారీచ సహాయుండై బంగరులేడి రూపమును ధరించి సీతకు

దైవయోగంబున రాజ్యం బన్యాక్రాంతంబగుటయు, అంధత్వము సిద్ధించుటయు, దారాపుత్ర సహితంబుగా పున్యారంబుల దినగూడును, గట్టగుడ్డయులేక కందమూల ఫలాదులచే కాలంబుగడుపుచుండిరి. అట్టివాడగు సాళ్వనృపాలతనయుడు తనయావిర్భావమునుండి సూనృతంబుగల వాడగుటవలన నాసత్యవంతుడందురు. సత్యవంతుడు పరిణయమూడిన యొక్కసంవత్సరములోన మృతిజెందుట నిశ్చయముకాన నోభూపతీ! పౌర్వాపర్యము లాలోచించి నీకూతునకు వివాహంబొనరింపు" మనుటయు సావిత్రింజూచి రాజిట్లనియె.

,,తల్లీ! సుగుణములకల్పవల్లీ! ఆతండల్పాయుష్కుండును, నిత్యదరిద్రుండును, యడవులంజేరి యిడుములగుడుచుచున్నవాడును నగుట నాతనింగోరి యేమియనుభవించెదవు. గాననోతల్లీ! యట్టివాని నుద్వాహమాడి యేమిసుఖించెదవు సకలసద్గుణోపేతుండగు మఱొక్కవరునింగోరుమని బలికె. పలుకగా నాసావిత్రియిట్లు ప్రత్యుత్తరంబిచ్చె.

,,తండ్రీ! మనోవాక్కాయ కర్మల నాతనినేవరించితిని ఇదివరలోనే నాతనికు భార్యనన్నమాట, ఎట్లందువా? రాజబాల మొదట మోహముంచిన వానిందక్క తదన్యుల వరించుట మారుమనువు గట్టుకొనుటయే. అల్పాయుష్కుడేగానిమ్ము. దరిద్రుండేగానిమ్ము నేడేచచ్చిపోనిమ్ము యెట్లయినను యాతనిందక్క యితరులు సార్వభౌములైనను, సచ్చిదానందమూర్తులైనను చచ్చువారైనను హెచ్చుపదవిరానున్నను, నాకక్కరలేదు గాననోతండ్రీ! నాతనినిందక్క నాకొరులు భర్తలగుటకంటె భావిసుఖంబును నేటఁ గలిపి తపస్సునకేగెదను. అనియబ్బాల సాకల్యముగా తనయభిప్రాయంబు నుడువుటయు రాజిట్లనియె.

,,తల్లీ! తాబట్టిన కుందేటికి మూడేకాళ్లను సామెతగా యాతనినే దక్క యన్యుల వరింపనని నీవు పెద్దపట్టుపట్టి బిట్టివగచిన నేమగలవాడను పెండ్లియైన మరుచటిదినంబుననే జచ్చువానినిఁగట్టుకొని యేమిసుఖించెదవు

యనుటయు నారదమహామునీంద్రుం డిట్లుపలికె.

"రాజా! యేదియెట్లున్నను సావిత్రి యాతనిం దక్క దదన్యుల వరింపనొల్లదు. గాన వెంటనే నీకూతు సత్యవంతునకిచ్చి యుద్వాహంబు గావింపుము" అని యానతిచ్చిన నారదమహామునీంద్రుని గాంచి సావిత్రి నమస్కరించుటయు నమ్మహాత్ముండు "దీర్ఘసుమంగళీభవ" యనియాశీర్వదించి యథేచ్ఛం జనియె.

అంతఁ గొన్నిదినంబులకు మద్రపతి చతురంగబలంబులతోడను ధనకనక వస్తువాహనంబులతోడను, అమూల్యంబగు నవరత్న మణిమయ భూషణంబులతోడను, దాసదాసీ జనంబులతోడను, శోభనద్రవ్యంబులతోడను, మంగళవాద్యములతోడను, మిన్నుముట్టునట్లు సకలబంధుమిత్రపురోహితవిద్వద్గాయక పాఠకవంది మాగధులతోడను, భార్యాసహితుండై, సావిత్రిం జేకొని యొక్క నాఁడు సుముహూర్తంబున పుణ్యారంబునకుం జని సాల్వనృపాలుండగు యశ్వపతిం జూచి నమస్కరించి కుశల ప్రశ్నంబులం జేసి తదనంతరంబు "నరేంద్రా! యీకన్యాలలామంబు మత్పుత్రికారత్నంబు. ఈబాలను నీకుమారుండగు చిత్రాశ్వున కిచ్చి వివాహంబు గావింప వచ్చితిని; గాన త్వదీయ మగు యానతి శెలవీయ వేఁడెదను." యనిపలుకుటయు నాసాల్వనృపాలుం డిట్లనియె.

రాజ్య విభవంబులఁబాసి యిట్లడవులం గాసినొంది వుపవాసంబులచే స్రుక్కుచున్న మాబోంట్లతో వియ్యమందుట కంటె భూమండలంబున నరేంద్రులకు లోపము వచ్చెనా? మరియు మణిమయఖచితంబులును దాసదాసీ జనంబులును, సౌధంబులు, యంతఃపురంబుల సంచరించి యమృతోపమానంబులై నెగడు పదార్థంబుల గుడిచి చీనిచీనాంబరంబులచే బంధుసఖీజనంబులతో సుఖంబుగా సద్గోష్ఠితో నుండు మీకన్నియను మాబోటి మానుల పుత్రున కిచ్చిన యామె యిట్టి యిక్కట్లు భరించి నిలువ గలదా? యిదేటి మాటలు నీవెఱుంగని ధర్మ

ములు గలవా? యని ప్రశ్నించెను. అంత సమ్మదమ్మతి సాళ్వపతింజూచి భూపాలా! కలిమిలేములు కావడి కుండల వంటివి. కావున యిప్పుడు మీరనుభవించుచున్న యిడుములు కలకాలము కాపురముండబోవు. యిట్టి శుభసమయంబునకు మీరు సమ్మతించి మద్బాలను సత్యవంతున కుద్వాహ మొనరింపుడని యాతని నొప్పించి యొక్క సుముహూర్తంబున సత్యవంత నామధేయుండగు చిత్రాశ్వునకు దన కూర్మి పుత్రియగు సావిత్రినిచ్చి వివాహంబు గావించి కొన్నిదివసంబు లచ్చటఁగడిపి యంతట నశ్వపతిరాజు పత్నీసమేతుండై తన రాజ్యంబునకు వేంచేసె.

అంత సావిత్రి వివాహంబు జరిగినది మొదలు ప్రతినిత్యము పతికి మున్నులేచి జలంబులాడి, శోభనంబులు గట్టి యింటంగల పాచిపను లెల్లఁ దీర్చి పతిచరణాంబుజంబు లభిషేకించి, పతియే తనకు సద్గతియని వివిధోపచారంబుల నాతని మనంబు సదానందంబు సేయుచు రాత్రింబగలు భర్తృపదారవింద ధ్యానముచే బ్రొద్దుపుచ్చుచు, ముని వరాంగనా యను నట్లు పతివ్రతాశిఖామణియై వెలసె. అట్లొక్క సంవత్సరకాలము సతీపతు లొండొరులు నీరక్షీరములు గలిసిన చందమున గలసి మెలసి సరససల్లాపంబుల నుండునెడ నపూర్వపతివ్రతామణియగు సావిత్రి మున్ను నారదుండను వాక్రుచ్చిన సంవత్సరగడువు సమీపించినదని యెఱింగినదగుట యాదినంబు మొదలు మూడహోరాత్రులు నిద్రాహారములు వర్జించి దృఢచిత్తంబున యోగసమాధి నిష్ఠాగరిష్ఠురాలాయెను. అట్టి నిష్ఠాగరిష్ఠురాలగు సావిత్రింగాంచి తల్లీ నీవేలకఠిన యుపవాసంబులచే తపించెదవు. ఇట్లు యుపవసించుటచే గనుడస్సి మోము వెలవెలబోవుచున్నది. కారణంబేమి చెప్పుము యని యడుగగా. ,, దేవా! మూడురోజులు నా కొక వ్రతంబుగలదు. అట్టి వ్రతంబు నెరవేరు వరకు గ్రుక్కెడు యుదకంబు నైనను నోటనిడరాదు. ఇది త్రిరాత్రోపవాసంబు కాన నో భూపతీ! నన్ను

„ఓ ధర్మరాజా! యేటి మాటలివి. భర్తతోడిదే ప్రపంచము భర్తలేన్నినాడు ప్రపంచమేం? నాతికి పతియేగదాగతి. సతికి పతిలేక పోయిన సద్గతి యెట్లు గలుగును. నేను మాలిపోజాల నీ యనుగ్రహంబు కలవారికి నిత్య శుభంబు లొసగూడి యేతీరును." అనుటయు సన్తరము సాధ్వింగని „అమ్మా! నీచెప్పినవొప్పు మెచ్చునచ్చె. నాథుని జీవనంబులం దక్క తదన్యంబేదేని యుం గోరుమిచ్చెద" ననవుడు „ మామామయు, యత్తయు, కంట్లులేక యుత్తలపాటు నందుచున్నారు. వారికి కంట్లు వచ్చునటు లనుగ్రహింపవే" యని వేడుటయు యిచ్చితి ప్పొమ్మనుయన్ని సమవర్తి బోవుచుండె. అనరంబు జేకొన్ని సమునన్తితోడనే బోవుచుండెను. „ తల్లీ! యేల మరల వచ్చెదవు" అన్ని పలుకగా „ దేవా! మిము బోటి యెరుకగల మహాత్ములు మనోవాక్కాయ కర్మల యుపకరించు హింసింప బూనరు. భక్తుల మనోభీష్టంబులు నెరవేర్తురు. అంతియేగాక నీవు సర్వసముండవు. నీవెరుంగని ధర్మమొక్కటి గలదా రవితనూజా! యని స్తోత్రముం జేయుచున్న సావిత్రిం జూచి „ ఓ పరమ పావనినగు సావిత్రీ! ఆకటిచే డస్సియున్న పాంథునకు నమృతము లభించినట్లు నీ మృదు మధుర పేశలంబులగు సుధోక్తులచే నేనెంతయు సంతసించితి. నీపతి ప్రాణంబులు మినహా నీ చిత్తము వచ్చిన వరంబు గోరుకొనుము." అన నా సావిత్రి యిట్లు గోరుకొనును.

„వందథనా! తొల్లి మామగారు పగతురచే నోడిపోయిన రాజ్యంబు మరల బొందునట్లనుగ్రహింపుము" ననుటయు „నట్లగాక" యని వరం బిచ్చి యేగుచుండె. నాపైనసన్వితుని నప్పటికిని విడువక జనుచుండ యముంపు వెనుదిరిగిజూచి „తల్లీ! యేట కిట్లు వెంబడించెదవు. రాబోవు మార్గము బహుళ కష్టప్రదంబు ఇక నిలిచిపొమ్మన్న." అనుటయు నా సావిత్రి „శమనా! ధర్మమూర్తులు. ధర్మమునే ప్రసాదింతురు. ధర్మ సింహాసనమున నధిష్టించుదురు. ధర్మమునే యాచరింపవలయును. తద

స్యంబు చేయకూడదు. స్త్రీలకు భర్తప్రాణంబుకంటె తీపియగు వస్తువు లేదు. అట్టి ప్రాణేశ్వరుని ప్రాణంబుల నీవు గొనిపోవ నేనెట్లోర్తును" అనుటయు "సుగుణభూషిణీ! సకల ధర్మముల యొక్క సారమును నీ వేకరవు పెట్టినను నియామితులు నియామకునకు నెదిర్చవలసినదే? అయినను భర్తప్రాణములుఁ దక్క వేఱొక్క వరముఁ గోరుకొనుము" అనుటయు.

దేవా! నా తల్లిదండ్రులగు మద్రపతి మాళవికలకు నూర్వురు పుత్రు-లుదయించునట్లు వరంబిమ్మని వేఁడె." ఆవరంబు గూడ యిచ్చి తరలుచున్న శమనుని వెన్నంటి సావిత్రి జనుచుండె. అట్లు వచ్చుచున్న సావిత్రింజూచి నాయొద్ద దేవంపు భర్తపదారవిందములు దప్ప తదితరము లొల్లని యో సాధ్వీ! వేఱొండువరంబు గోరుమిచ్చెద" సనుటయు సావిత్రి ధర్మపరిపాలా! ఇదివరలో మగడు దక్క నేదైనను యిచ్చెదననుచు వచ్చితివి. ఇప్పుడది మఱచి గోరు వరమిచ్చెద నంటివి. గాన భర్తప్రాణంబులనే దయచేయుము వేఱొండక్కరయు నాకనవసరము లేదనుటయు యట్టివరం బొసంగె. "మహిషవాహనా! భర్తవియోగానలచింతనంబును నీకరుణామృత వృష్టిం జల్లజేసి నాపుణ్యనాథుని లబ్ధునిగ జేసిన నీకిదే వందనము ల"ని సావిత్రి యమునకు నమస్కరించెను.

"తల్లీ! నీకు నూర్వురు పుత్రులు గలుగగలరు. నీభర్త నాలుగు వేలేండ్లు పరిపాలన చేయగలఁడు. మీరనేక యాగంబులు జేసి సద్గతి నందగలరు" నియానతిచ్చి తిరోహితుండయ్యె. అంత సత్యవంతుఁడు లేచి తాను యింతసేపును నిదురించితినని తలచి "కలికీ! యేలయిట్లు నిదురించితిని" అనవుడు సావిత్రి వృత్తాంతము సాకల్యముగా నెఱింగించి తలిదండ్రుల కడకరిగిరి. అచ్చటవారు కన్నులువచ్చి స్వేచ్ఛగా నుండిరి. అచ్చట వారి తలిదండ్రులకు నూర్వురు పుత్రు లుదయించిరి. పోయిన రాజ్యము స్వేచ్ఛగా దీసికొని అవక్ర విక్రమంబునఁ బరిపాలించుచుండె. కాన నో తల్లులారా! సావిత్రి మనోనిగ్రహంబు గలిగి నాథుని బ్రదికించవలె

నని త్రిరాత్రోప వాసముగావించి యముని నిర్జించి పోయిన రాజ్యమును దెప్పించి, నూర్వురు తమ్ములనుబడసి, అత్తమామల లోచన గోచరంబు గావించి, భర్తప్రాణంబులతో సహితము నూర్వురు పుత్రులను బడసినది. యేశక్తిచేతనో తెలిసెదా? అట్టి శక్తిని మీరుపయోగించి యాంధ్రావనికీర్తి నిలుపుడు.

## ౫ చంద్రమతిచరిత్రము

పూర్వకాలంబు కాకుత్థ్సవంశసంభవులలో నుద్భవించినహరిశ్చంద్రుండను నొక్క సత్యవాక్యపరిపాలనాధౌరేయుండు యయోధ్యాపురంబును బరిపాలించుచుండెను. అట్టి సత్యసంధుండగు హరిశ్చంద్ర భూజానికి చంద్రమతియను నొక్క భార్యగలదు. ఆచంద్రమతికి లోహితాస్యుండను నొక్కకుమారుండుదయించెను. ఇట్లుండగా నొక్క నాఁడు దేవేంద్రుని కొలువుకూటంబున యీరేడు జగంబుల సత్య సత్యవ్రతుఁడెవ్వఁడో పృచ్ఛించుమని సప్తఋషులసన్నిధి దేవేంద్రుఁడడుగగా వశిష్ఠుఁడులేచి దేవా యయోధ్యాపురంబును బరిపాలించుసత్యసంధుఁడగు హరిశ్చంద్రు

ఆమాటలకు విశ్వామిత్రుండు కినిసి ఓ వశిష్టా హరిశ్చంద్రుఁడబద్ధమాడడా ఒక్క మనుష్యమాత్రుఁడబద్ధమాడడనుట సువర్ణమునకు వాసన యున్నదనుట యెట్టిదో యట్టిదేయగును ఆతఁడు యబద్ధమాడువాఁడే కాని నిబద్ధమాడువాఁడు యెంతమాత్రమును గాఁడు. గాడనుటయు వశిష్ఠునకుకోపమువచ్చి ఓ విశ్వామిత్రా! యేమివాక్రుచ్చితివి. ఔరా! హరిశ్చంద్రుఁడబద్ధమాడువాఁడా వానిని బొంకించుటకు త్రిలోకంబు లెత్తివచ్చినను త్రిలోకంబులేకమైనను, సముద్రము లింకిపోయినను యబద్ధమాడడు. ఇదిముమ్మాటికిని నిజంబు. అని తమ యానంబుఁ జేరఁగిలఁ బడుటయు,

ఓ వశిష్టా! చూడుము నాప్రజ్ఞ నేనెట్లేని వానిని బొంకించెదను. అట్లు బొంకింపలేనియెడల మున్ను నేనార్జించిన తపఃఫలంబంతయు నాతనికిచ్చి పదు నాలుగు మన్వంతరములు వఱకు యాతని దేవేంద్రసింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టి స్వర్గలోకంబేలింతును. ఇదియనాప్రతిజ్ఞ యని యాతఁడు గూర్చుండెను. అంత వశిష్ఠుండులేచి నీవసత్యమాడించితివేని నా సంధ్యంబులను ద్రెంచివైచి తలబోడిచేయించుకొని శరీరమంతయు నల్లనగు రంగున దిద్ది గాడిదపై నెక్కి లోకులందఱు ఛీఛీ! యని యుమియుచుండ దక్షిణాభి ముఖముగా నరిగెదను. ఇదియ నాప్రతిజ్ఞ యనుచు ప్రతిజ్ఞలఁ బట్టితమ తమ నెలవులకుఁ జేరిరి. అట్లు కొంత కాలంబేగిన పిదప నొకానొక జన్మంబు కౌశికుండు వల ఎట్టి హరిశ్చంద్రుని సన్నిధి కరిగి యాతనిని దీవించి వారిచే సత్కారంబులనంది, ,,ఓరాజా! సత్యవ్రతా సుస్థిరగరిష్ఠుండవనియు, ధర్మ చింతనారతుఁడవనియు పలువురముఖంబుల పలువిధములుగా విని నిన్నుఁ జూడవచ్చితిని. నీవలన నాకొక సహాయము కావలసి నిన్నర్థింప వచ్చితిని. నేను యీశ్వరార్పణముగా నొక యాగంబుజేయ దలచితిని. ఆయాగమునకు మనుజుండేను నొక్క యొకరత్నంబు చేబట్టి యంతరిక్షమున విసరివేయ నెంత పొడవుపోవునో యంత ద్రవ్యము నాకవసరమై యున్నది. ఆయాగము నిర్విఘ్నముగా కొనసాగుటకు యాధనము నిన్నర్థింప వచ్చితిని. ఇచ్చితివేని యాగంబు [illegible]ను. లేకున్న మానెదను. ఇచ్చెదవో, లేదందువో, చెప్పఁగోరుచున్నాఁడను. అనుటయు నంత నయ్యరిశ్చంద్రుండు మునికుల తిలకునిఁ దిలకించి ,,దేవా! మీవంటి మహాత్ములు యిటునిటే తడవుగాదా వచ్చి కృతార్థత్వంబు నొందుటకంటె మఱియొక విధమగు పుణ్యోపార్జనంబు జేయగలమా మీవంటి మహాత్ముల దర్శనమాత్రంబున పవిత్రుండ నైతి. మీయభిమతార్థంబు యట్లే యిత్తును చేకొని నన్ను పవిత్రుం జేయుఁడు రాజా! యిప్పుడు ద్రవ్యముతో నిమిత్తములేదు. యాగారంభమున దీసికొనెదను, అంత

వరకు నీవద్దనే యుండనిమ్ము. యని జెప్పి తన యాశ్రమంబునకుం జనియె. అట్లుజని తన శిష్యులలో యగ్రగణ్యామూర్ధ శిఖామణియగు నక్షత్రకుని యాధనంబు దెమ్మని బంచిన మున్ను మతంగ కన్యావివాదంబులో యవనీ తలంబెల్ల కౌశికునకే ధారపోసినవాఁ డగుట నక్షత్రకుని వెంటనిడుకొని కాశీపట్టణంబునకు బయలుదేరెను. అట్లు యాపట్టణంబు జేరెయన్నపూర్ణా సహిత విశ్వేశ్వరుల నీక్షించి మ్రొక్కులిడి తక్కుంగలపనులకై పట్టణంబునకే తెచింపవారై సాధుసంశీలయగు చంద్రమతిని విక్రయింప మది నూహించి పట్టణవాసులారా వినుండు ఈకాంత మత్ప్రాణ కాంత. దీనిం జంద్రమతి యనియందురు. విశ్వామిత్రుని యాగంబుని మిత్తంబు నేనిచ్చెదనన్న ధనంబు కొఱవడుటచే యీతల్లోయ్యాలిని విక్రయించుచున్నాడను. గొనువారలున్న నీపడితిని గొనవచ్చును యనుటయు గాల కౌశికుండను బ్రాహ్మణుండు తాను హరిశ్చంద్రుదడిగిన ధనంబిచ్చెదనని చెప్పుటయు హరిశ్చంద్రుండు నాతిని నాతనికే విక్రయించి నక్షత్రకునికే యాధనంబు యిచ్చివేసెను. అంత నక్షత్రకుండు. ఆర్యా! కౌశికునకు యివ్వవలసిన ద్రవ్యం బిచ్చివేసితివి. మాభత్యంబులకివ్వవలసినది గూడ యిచ్చి మరి కదలుమనుటయు నా హరిశ్చంద్రుండు సత్యవాక్య పరిపాలనా సక్తిచిత్తుఁడగుట చేత తానుగూడా యమ్ముడు వోయి యాతని ఋణంబుదీర్చుట ముఖ్యవిధియని యెఱింగితానుగూడా యాయూరికి కాటి కాపరియగు వీరబాహుండను యగ్రివర్ణము వానికి విక్రయింపఁబడి యాధనంబు యాతని.కిచ్చి వేసెను. అచ్చట చంద్రమతీదేవి సేవకా వృత్తిలో కలహ కం ఠి చెప్పిన పనులంజేయుచు గాలంబు గడుపుచుండె. ఇట్లుండగా కౌశికుసను మతిచే బాలురతోఁ గూడి లోహితుఁడు సమిత్కుశ ఫలాదులకు యడవికింబోయి యక్కడ యాకులు గోయుచుండగా నొక్క సర్పంబు గరచి మృతి జెందెను. అవ్వార్త చంద్రమతికిఁ దెలిసి ,, హా! పుత్రా!

నీకిట్టి దుర్మరణంబు దైవంబు విధించెనా?" యని యేడ్చుచు కలహాకంఠి కడకేగి శెలవు యడుగగా యింట పనులెల్లఁ దీర్చి వెడలు మనుటయు యింటఁగల పనులెల్లయుఁ జక్కజేసుకొని లోహితుని వెదుకుకొనుచూ యాతడుండు స్థలముఁ గనుగొని కొంతసేపు విలపించి రుద్రభూమికి యాకళేబరంబునుజేర్చి యొక్కొక్క కాష్ఠంబుగానేర్చి యొక్కచో చితి పేర్చి యందు లోహితునుంచి యగ్ని రగుల్కొల్పుతరిని యప్రేతభూమి ని గాపాడుచుండు వీరబాహుని సేవకుఁడు వీరదాసనువాఁడు యామెను డగ్గరి "యువిదా! యీయర్ధరాత్రింబున కటిక చీకటిలో భూతభేత పిశాచంబులుండునని యైన జంకక నీవిట్లువచ్చి కాటి సుంకము వసూలి వ్వకుండగనే శవదహనమునకుఁ బూనుకొను సాహసముగల యువతి నీవె వ్వతెవు? కాటిసుంకము యిచ్చిననేగాని యిక్కడ దహనము చేయుటకు వీలులేదు గాన సుంకము చెల్లించు" మనుటయు, "ఓ సత్పురుషా! నేనొక్క సర్వసర్వం సహాచక్రంబు నిర్విక్రమంబుగా బరిపాలించిన యొక్క భూనేత సతిని అయిననేమి? నేటికొకకానుపకు గతిలేక మతిచెడి యిట్లు యర్ధరాత్రింబున శవదహంబునకు వచ్చితిని. భాపురే? యిచ్చు ట సుంకము నిర్బంధము. ఏమి చేయుదును దైవమా! యని విచారించు చు బలికిన బలుకులకు వీరదాసుండిట్లనియె.

"తన్వీ! నేనొక వీరబాహుండను చండాలుని సేవకునిగాని స్వతం త్రతాశక్తి యిదివరకే గతించినది. గాన సుంకము యియ్యకతప్పదు. నీగళంబునగల మంగళ సూత్రమైనను యిచ్చి మరిశవదహనమునకు గడం గుమనుటయు, మాఁడయివ్వక, మంగళ సూత్రమివ్వక, యాలస్యంబుచే సితివేని స్వామి యానతి దప్పిన వాఁడనై సత్యవంతుడను కీర్తి నశించును. కాన నీకేది యిష్టమో యదియాచరింపుము." అని చెప్పిన చంద్రమతి విస్మయ సంభ్రమాశ్చర్యంబులు ముప్పిరిగొన "అయ్యా! నాగళంబున గల మంగళ సూత్రము నాభర్తకుఁ దక్క యొరులకుఁ గాన్పించదు.

నత్యశీలుండగుహరిశ్చంద్రావనీశుండనీవై యుందువు. ఈచచ్చినబాలుఁడు నీకుమారుఁడు లోహితాస్యుండు. గాన నోప్రాణనాథా! కాటి సుంకము నకు కలహకంఠియొద్దకుఁ బోయి కాటి సుంకము జేకొని మీకిచ్చెదను. గాన పుత్రుని శవమును గాపాడుచుండు మని యొప్పగించి జనియెను.

అప్పుడప్పుకమిజేఁకు మరణించినవాఁడు పుత్రుండగుట యెఱింగి శోకాకులిత చిత్తుండై చేయునది లేక చిట్టువగిచి యూరకొనెను. అట్లు చంద్రమతి మాడ కొఱకుఁ బోవుచుండ మధ్యరాత్రియందు దొంగలడ్డమై మాయోపాయంబుచే నామెయొడియందు కాశిరాజపుత్రుని శిరంబు వైచుటయు యొంటరిగా బోవుచీమెను తలారులుగనుగొని పుత్రఘాతిని యిదియేయని నిశ్చయించి యామె నొకశోధం చేయగాయందు శిరంబుండుట గనుంగొని కాశీరాజు నెదుటింబెట్టిరి. ఆమెకు శిరచ్ఛేదన మొనరించ యాజ్ఞనిడి వీరబాహునకప్పగించమని తలారుల కప్పగించిరి. వారును దిగ్నగాఁదీసుకొనిపోయి వీరబాహున కప్పగించిరి. వీరదాసున కీవరమాంసంబెఱింగించి యాశని శిరచ్ఛేదన మొనరించుమనుటయు యాతఁడట్లకాకయని తన మొలనున్న ఖడ్గముంబెఱికి నొక్క వ్రేటువ్రేయనది పూలమాలగా బరిణమించుటయు, నామె పాతివ్రత్య ప్రభావమునకచ్చెరువంది మరల నొక్క వ్రేటు వేయఁబోవ యుమాపతియును గౌరికుండును యడ్డమై వారించిన యది విని పించుకొనక సత్యమునకు భంగము కలుగు ననే భయంబుతో మరల వేయఁబోవ శంకరుండిట్లనియె.

ఓనిత్య సత్యవ్రతుండవగు హరిశ్చంద్ర మహీరమణా! నీవు గొలుచుచున్న వీరబాహుండు వీరబాహుండుగాడు. యముండు నీవున్న యీభూమిరుద్రభూమియుగాదు. యమునిచే పరిపాలింపఁబడుచున్న పుణ్యభూమి. నిన్ను పరిశోధింపఁగౌశికుఁడుప న్నిన పద్మవ్యూహమిది. నేను పరీక్షపం పూర్తి మైనది. పదునాలుగు మన్వంతరములు స్వర్గలోకమును బరిపాలిరి

పుము. నీసత్యవ్రతంబును, నీ భార్య పాతివ్రత్యమును మెచ్చవచ్చె. గావలసిన వరంబులు గోరుకొనుఁడనెను.

కాశీ విశ్వనాథా! పరీక్ష కాలమందు నీదర్శనభాగ్యమే కలిగినది. ఇంకేమి గావలయును. నా తనయుని బ్రదికించుడనుటయు యట్లకాకయని లోహితుని బ్రదికించి నిజేచ్ఛం జనిరి.

నిఖిల జగంబులను నిమిషమాత్రంబులో జయింప గలుగుదురని సుమతులు చంద్రమతి పాతివ్రత్య శీలము భావింపదగినదనుచుకొని పరమ పతివ్రతలు గింపు. తెంపు.

చంద్రమతీ చరిత్రము సంపూర్ణము.

# ౯ దమయంతి చరిత్రము

తొల్లి నిషధదేశమును నేలు వీరసేన మహారాజునకు నళుడను నొక్క సుకుమారుఁ డుదయంబయ్యె. ఆతనికి విదర్భాదేశాధీశుండగు భీమరాజు పుత్రికను వివాహంబు జేసుకొన కుతూహలంబుండై యుండ, నామె చక్కదనమునకు మదికక్కజమునంది యింద్ర, యగ్ని, యమ వరుణులు మెచ్చి మోహోన్మాదులై యామెం బెండ్లియాడ మది నుత్సహించిన వారలయి, నలునున్న తావున కేతెంచి, "నలా! సుగుణమాలా! భీమసేనపుత్రికం బాణిగ్రహణంబు జేసుకొన దమకంబు జనించి నీవంటి ధర్మచింతాతత్పరుండను దర్శించి మాకోర్కెలు నెరవేర్చుకొన నిన్ను దమయంతి యొద్దకుం బంపవచ్చినారము. కావున నో నలా! నీవు దమయంతికడకేగి వేర్వేరమా ప్రభావంబు తెలియంగించి మాకు దమయంతినిం గూర్చి పుణ్యముం గట్టుకొమ్ము. మమ్మెలాగునైన వరియించునట్లు జేసితివేని నీకు పుణ్యంబుగలుగు. మాకామితములీడేరు" నని బలికిన

జెప్పుటయు నాదిక్పాలురు ,,రాజా ! నీసత్యభాషణంబులకు మేముసంతసించితిమి. స్వయంవరమునకు యందరిరాజులతో మేమునువచ్చెదము. ఇందె వరినివరించునో చూతముగాక! యనిపలికి యదృశ్యులైరి. అంతగొన్నిదినంబులకు స్వయంవరము జాటబంపగా వినినవారై నలుపురును నలవేషములధరించి రాజులతోఁగూడవచ్చి స్వయంవరమంటపమున నలమహారాజుచెంత గూర్చుండిరి. అంతట భీమసేనమహారాజు పుత్రిందోడ్కొని వచ్చి యామెసఖులచే రాజాధిరాజులలో నొక్కొక్కరినిజూపించి వారిగుణముల వేర్వేరవర్ణించి జెప్పెను. అంతటనలుండున్న దిరకురాగా నలునిబోలియే యచ్చట తొమ్మండుగురుండిరి. అట్టివారలలో నెవ్వనినలునిగానిరూపించుటకును వలనుగాక నిశ్చేష్టితులై మనంబు ముప్పిరిగొన చెలులూరక నిలుచుండెఁ.. అంతట దమయంతి యచ్చటగల చిత్రముగని దేవుళ్ళారా ! నేనునలునిదక్క యితరులను కుబేరునైనను వరింపను. అనిమిషులు నిర్జరులు, శతాశ్వమేధములొనర్చిన పుణ్యాత్ముల కాటపట్టగు స్వర్గనరకంబులేలుక్షుత్పిపాసలులేక వివిధభోగంబుల ననుభవించు దేవతలై యుండియు గూడా, మాంసచర్మ హస్తంగతంగునన్న కామించి యేమిబాముకొనెదరో తెలుపు" డనుటయు నానలాభామినిం దిలకించి ,,ఓభామినీ ! నీవునలునిదక్కయితరులను వరింపనంటచే పరమసాధ్విమతల్లి వైతివి ! యనిజెప్పివారివారి నిజరూపములనొందిరి సుమనుష్యచిహ్నమటయు నలుండుమాత్రమున లునిగాగస్పష్టమటయు లజ్జానతవదనయై యల్లనసమీపించి మృదుపాణితో పూలమాలవైచిన యాదిక్పాలురును వధూవరులనాశీర్వదించి తమతమ నివాసంబులకుంజేరిరి. ఆవెనుక దమయంతి ,,స్వాయంవర్తి వినాదైవం స్త్రీణాంజన్మసుజన్మను" యనుస్మృతిప్రకారం పతినేదైవసమానముగాభజించి త్రికరణశుద్ధిగా నాతనినిబూజింపుచు కాలంబుగడపుచుండె.

కొంతకాలమునకు శనేశ్వర మహాత్మ్యంబుచే ద్యూదమాడిదాయాదులకు రాజ్యముఁగోలుపోయి యడవులంబట్టిజని, పలుకష్టంబులనుభవిం

చుచు, నొకనాఁడు మిక్కిలి యాకలియగుటచే నోర్వలేక కొన్ని పక్షులు దమసమీపమున వ్రాలియుండఁగా నలుండాపక్షులనుబట్టి యాకలిదీర్చు కొనవలెను యుద్దేశముతో తనమీఁదనున్న వస్త్రంబును పక్షులపై వేయ గానవి మాయాశకుంతంబు లగుటవలన నాపుట్టంబు గొంచ యంతరిక్షము నకెగిరిపోయెను.

అంతనలుండు వస్త్రవిహీనుండై మిక్కిలివిచారమునొందుచుండ గానాదమయంతి సగముకోకచించి యాతనికిచ్చి ధైర్యంబుగరపె. అట్లుం డగొన్నినాళ్ళకు నాదమయంతినిగని "ఓమానినీ! కఠినపాషాణయుతంబగు నీయరణ్యంబున నాతోడనడచి రానేరవు. ముందుముందు భీకరంబగు నరణ్యంబు సమీపించు కాన నోతన్వీ! నిన్నుగొనిపోయి నీపుట్టింట విడిచి వచ్చెద నచ్చటసుఖంబుండుము. నాతోడనిడుములఁ బడజాలవని బలుకగా నాయింతి యిట్లుప్రత్యుత్తరంబొసంగె "ప్రాణప్రియా! మంచిమాటాడితివి, పురుషులు యిడుములు బడునప్పుడు దగ్గరనుండి యుపచారంబులాచరింపవలసినదే భార్య. మిమ్మొంటిగా నీయడవులయందువిడిచి నేను మాత్రము సుఖంబుండుట యేటిధర్మము. మనకష్టములు గట్టెక్కువరకు మనమిద్దరము విదర్భకు జనియే యుందము. రమ్మని ప్రార్థించె. అట్లను నాయింతినిజూచి నలుండు చతుస్సముద్రవేలాయుతమగు వీభూవలయంబు నేకచక్రంబుగా బరిపాలించిన సార్వభౌముండగు నేనీలాగున ముఖముఁ బెట్టుకొని వారివద్దకువచ్చెదను. పూర్వకర్మసంచితార్థమగు యీకర్మయనుభవించియే తీరవలయును. యనుటయు నంతనాదమయంతి యిట్లుప్రత్యుత్తరంబిచ్చె. "ఓకాంతా! కష్టంబుల సహింపలేక యిట్లంటివి క్షమింపు" డనిచెప్పినిద్రకొరగె. ఆమెయట్లునిద్రించుచుండగా కోకసంగముచించుకొని పారిపోయెను. మిగిలిన సగముపుట్టముతోడ నాదమయంతి నిద్రనుండి మేల్కాంచి ప్రాణనాథునిగానక దుఃఖించుచు "ఆహా! దైవమా! యనియరణ్యమున గుమ్మరుచుండగా నొక విషారగము విషానలంబుగ్రక్కు

చు నతిభయంకరమ్ముగ నామెంబట్టి మ్రింగనుద్యుక్తయయ్యె. అట్టితఱిం బున నొక్కయెఱుకువాఁడు యాపాము నొక్కబాణమున ద్రుంచి దమయంతిగాపాడె. అట్లుగాపాడిన దమయంతినిఁ జూచి ,,భామా! లావణ్యసీమా! ఇట్టి భయంకరములగు యరణ్యములకేల వచ్చితివి. ఒంటరివై యేలయిట్లు మెలగుచుంటివి. ఇచ్చటగల యెఱుకుల కెల్లకధినాయకుండను నన్ను 'రింపుము. ఎనలేనిభోగములందగలవు." యనిబలాత్కరించుటయు ,,అన్నా నన్ను విషారంగనుండి విడిపించిన నీవుభ్రాతృసమానుండవు. గాననో తండ్రీ! పరమపతివ్రతలెవరలు వారెవిగోరె యెంతమంది హతులై రోఁదెలిసికొనుము. బుద్ధిగలిగుండు" మని చెప్పుటయు యెఱుకయామెమాటలు విననొల్లక గనయ సుంకించుటయు నామెయాతని బూడిదగమ్మని శపించె.

పతివ్రతల మాటల మోఘములనుట కింతకంటె నిదర్శనమేమిగావలయును. పతివ్రతశపించిన మాత్రమున పట్టపగలే చుక్కలురాల్చును. భూవలయంబు దలక్రిందగును. సూర్యచంద్రుల గమనము మందగించును కాననో భారతనారీలలామలారా! దమయంతి దర్శనమే దొరకలేదుగాని యామెచరిత్రమును పఠించి సంతతసాధ్వీమతల్లులై వర్ధిల్లెదరుగాక!

అంతటయామె కొందరవర్తకుల సహాయ్యంబున సుబాహుపురము చేరి యచ్చటిరాణివద్ద దాసీగాచేరి యూడిగంబుచేయుచు గాలంబుగడుపుచుండె. అంతగొన్నిదినంబులుగతించ పుట్టింటినుండి సుదేవుండను నొక్క బ్రాహ్మణుండు పుణ్యాహవాచన నెపమ్మున నాదేవి నన్వేషించు కొఱకై యారాజమందిరమున బ్రవేశించి దమయంతింగాంచి యాక్షణము నయచ్చటనుండి తరలి విదర్భకుంజని భీమసేనునకు దమయంతివర్తమానం బెఱింగించె. అంతనాభీమసేనుండు సుబాహుపురంబునుండి దమయంతినాత్మగృహంబునకుఁ దోడ్కొనిజనియె.

అట్లుండ గొన్ని దినంబులకు పర్ణాదుఁడను బ్రాహ్మణునివలన నల మహారాజు యయోధ్యాపురంబు బాలించుచుండు ఋతుపర్ణునియొద్ద యశ్వశిక్షకుండును, వంటలవాఁడునునై మరుగుజ్జు వేషంబు చిలువయొక్క పరిసాదంబుఁగలుగుటచే నాతనియొద్ద గొలువుండె. ఇవ్వార్త భీమసేనునిచే బంపఁబడిన యొక బ్రాహ్మణాచారునివలన తెలిసికొని దమయంతికి ద్వితీయ స్వయంవరమని చాటఁబంచె. వారియొద్దేశ్యంబు ఋతుపర్ణుఁడును, తదితరరాజులును స్వయంవరమునకు విచ్చేసి వచ్చెదరు. ఋతుపర్ణునితో నలుండును వచ్చియే తీరును. అనే యుద్దేశము. అట్లే ఋతుపర్ణుండును ద్వితీయ స్వయంవరమునకుఁ బయలుదేరె నలుని యశ్వశిక్షకుఁగాని యమించెను. వారట్లు విదర్భజేరుటతోడనే కేశినియను నొక్కదాసి బాహుకుండున్న యెడను బిడ్డంగొనిపోయిన యాబిడ్డంజూచి యెత్తుకొని ముద్దులాడి బిట్టువగచెను. ఆబిట్టువగచుట కేశిని గనుగొని యావృత్తాంతము దమయంతి కెరింగించిన యాతఁడే నాప్రాణనాథుండు నలుఁడు. నిషధదేశాధీశ్వరుఁడుయని తన మనమున నిశ్చయించి తలిదండ్రులకు వృత్తాంతంబుదెలిపిన ఋతుపర్ణుని యనుమతిపై బాహుకునచ్చటికిరావించి బాహుకా! కాదు కాదు నలా! యేటికిట్లు మారువేషముచే మరుగుపరచజూచెదవు. సూర్యవంశపురాజు లబద్ధంబులాడరు. ఆలుబిడ్డలయెడవులవిడిచి యన్యదేశంబుల నీవుండుట తగదని నీవెరుంగని ధర్మమా! ఇది దమయంతికర్మమా? యని పెక్కువిధంబుల యడిగిన బాహుకుండు విషాదమంది కర్కోటకునిచే మున్నొసంగబడిన వసనమునుగట్టుకొన్న యొప్పటి రూపమును ధరించి మించె.

"దమయంతీ! నాథుండెట్టివాఁడైనను మగువకు రెండవ పెండ్లి యనుమాట నేటికిక్కడనే యుద్భవించినది. గాని యొరులు విన్ననగుదురౌ నగరౌ విచారింపుము. దీనిని దేనిచే సమర్థించెదవు." అనుటయు నా దమయంతి యిట్లు చెప్పె.

" మనోకాంతా! మన్మథుని జయింపఁగల సమర్థులు మీరుండ గా యితరులను నేను వివాహమాడుదుననుట కలలోనివార్త. ఋతుప ర్ణునియొద్ద మీరున్నవార్త విని ద్వితీయ స్వయంవరవార్త మిషబన్నినగాని రారనుకొనుటచే యొక్క ఋతుపర్ణునికే లేఖబంపినాను నాతండ్రి. ఏదీ తక్కినరాజలోక మెచ్చటనైన నున్నదా? నేనుసాధ్విగానా?" యని యను టతోడనే సూర్యచంద్రులు " సత్యము పతివ్రతయే సత్యమ"ని పలుకు టయు యామెం జేకొని సుఖంబుగాగాలంబు గడపుచు గొన్నిదినంబులే గిన తరినొక్కనాడు తొల్లితన్ను జూదమునందు నోడించిన పుష్కరమ హారాజుతో మరల జూదంబాడి గెలిచి నిజరాజ్యంబును దనభుజస్కంధ మున నిడుకొని రాజ్యంబు జేయుచుండె. యెప్పటికైనను ధర్మమే జయించును.

దమయంతీచరిత్ర సంపూర్ణము.

---

# ౫ అరుంధతి చరిత్రము

పూర్వకాలంబున దేవపురోహితుండును, ఋషులలోనెల్ల శ్రే ష్ఠుండును, రఘువుమొదలు రామునివరకు వారివంశము పౌరోహిత్యమునె రపిన వాండునునగు వశిష్ఠుండనుమహానుభావుండు గలడు. ఆతనికిమొట్ట మొదటినుండియు వివాహాపేక్షలేక కొంతకాలమేగినతరి వివాహాపేక్షగలు గుటయు పద్మినీజాతిస్త్రీ యెచ్చటనైనను లభించునోయని యుర్వీపురు చుపట్టణంబులలోను యాశ్రమంబులలో మునికన్యకలను జూచుచు బో వగా మతంగుడను మహాముని యొద్ద యొకసత్పుత్రియున్నదని దెలిసికొన్న వాడై మతంగుని సందర్శించి "మహానుభావా! మతంగా! యరుంధతి యను నొక్కకన్యకాలామంబు యున్నదనివిన్నవాడనై భవద్ధర్మనార్థము నేనిటకు వచ్చితిని. ఆకన్యకను నాకు ద్వాహముఁగావించి నావంశమును

యభివృద్ధియగునట్లాశీర్వదింపు" మనుటయు సమ్మతంగుంను బ్రహ్మ మానసపుత్రుండవగు నీకు నా కూతునిచ్చుట కన్న వేరొండు నాకేమిగా వలయు" నని యాతనికి యరుంధతినిచ్చి వివాహంబుగావించి వశిష్టుని యాశ్రమంబునకుఁ బంపివేసెను. వారట్లు యాశ్రమంబు ప్రవేశించి నిత్యవిధులను దీర్చుకొనుచు యరుంధతి పతిని పరబ్రహ్మస్వరూపముగా నెంచుకొనుచు గాలంబుగడపుచుండె.

ఇట్లుండగా నారదుండొక్క నాఁడు త్రిలోకంబులఁగల పతివ్రతల తెలుసుకొనఁగోరి కొన్ని కొండరాళ్ళనేగ మూటగాఁ గట్టి లక్ష్మీనారాయణులున్న యెడకుంజని సత్కారంబులంది యంజలీబద్ధుండై యుండెను.

,,ఓనారదా! విశేషంబులేమైన నున్న యెరిగించు" మనుటయు నాతఁడిట్లు ప్రత్యుత్తరంబొసంగె. ,,నారాయణా! నేనుగొన్ని దినంబుల నుండి యుపవాసంబులఁ జేయుచుఁ గాలంబు గడపుచుంటిని. గాన యీ కొండరాళ్ళను శనగలుగావేచి యిచ్చిన దృప్తినీరఁగోరిలి నీరంబులదాగ్రెద" ననుటయు లక్ష్మీనారాయణులు యద్భుతపడి ,,ఓయీ! వెఱ్ఱి నారదా! కొండరాళ్ళను శనగలుగా జేయుట యిదివర కెచ్చటనైనఁ గంటివా? యేటికిట్టి వెడఁగు మాటలు ఇది మావల్ల కానేరని పని" యని తిరస్కరించిన నానారదుండును యా రాళ్ళను దీసికొని పార్వతీశంకరులుగల చోటికిం గొనిపోయి వారల జూచి నమస్కరించి వారలచే ప్రత్యుత్థానమునుగొని యంతట యా రాళ్ళను వారల ముందరనిడి శనగలుగా వేచి యియ్యు డనుటయు నాపార్వతీ శంకరులాశ్చర్యము నొంది ,,నారదా! తెల్లకుక్క నల్లకుక్కయగుట దటస్థించునేని యీ రాళ్ళు శనగలుగా మారవచ్చును. అంతియేగాని రాళ్ళెక్కడ? శనగలుగా మారుట యెక్కడ? యిది యసంభవము" అనుటయు యా రాళ్ళను మూటగట్టుకొని సరస్వతీ బ్రహ్మలున్న యెడకుం జనుదెంచి ,,అమ్మా! సరస్వతీ! నేను యెన్నియో దినంబులనుండి శనగలు దినవలెనని కోరిక

గలుగుటచే, యీ కొండరాళ్ళను మీ సన్నిధానమున కీడ్చుకొని వచ్చి తిమి. కాన యీ రాళ్ళను తెనగలుగా మార్చి యియ్య తల్లీ" యని యనేకవిధంబుల బ్రార్థించిన వారలిట్లనిరి. అంత నాసరస్వతీదేవి మునీం ద్రునిగని "దేవా! మంచి యుపయోగకారియగు పనినే యర్థించితిరి. సూర్యుండు చంద్రుడగునప్పుడు, చంద్రుండు సూర్యుండగునప్పుడు దప్ప తదితర కాలంబులయందు యీ రాళ్ళ తెనగలుగా మార్చుటకు సావ కాశము జిక్కదు. ఏటిమాటలివి. పోవమ్మా" యనుటయు నారదుండు యా రాళ్ళను మూటగాగట్టి దిన్నగా వశిష్ఠుని యాశ్రమంబునకు బయలుదేరెను. బయలుదేరి యాఋషిచంద్రుండు వశిష్ఠుని యాశ్ర మంబుజేరి యచ్చట వారిచే యర్ఘ్యపాద్యంబులంది కూర్చుండె. అంత వశిష్ఠుండు నారదునిం దిలకించి యిట్లు పలికె.

"మహాత్మా! మీరాకవలన మద్గృహంబు పావనంబయ్యె మాజ న్మంబులు ధన్యత్వంబుజెందె. తమరిచ్చటకు వేంచేయుటకు యేదియో పెద్దకారణంబే యుండియుండును. ఆనతీయ వేడెదను." అనుటయు నా మౌని యిట్లుప్రత్యుత్తరం బొసంగె.

"ఓ పుణ్యదంపతులారా! నామనోవ్యథను యేమని చెప్పుదును. "నళినీదలగత జలమతితరళం తద్వజ్జీవిత మతిశయచపలమ్మ" నునట్లు యీ మహాయాత్రములు మానవలోకములు దిరిగితిరిగి యలసి క్రుక్కి-ను నీట్లునై నందాత్రవక యవయవముల బింకముసడలి, బలహీనత్వంబున తమసన్నిధానమున కేతెంచితిని. ఇంతకుముందు యేచెట్టుక్రిందనో ప్రాణ ములు విడువవలసినదేగాని యట్లుజరుగక దైవమన్యదాయగుటచే మీ సన్నిధానంబు చేరగంటి. నాకోర్కె యిప్పటికి నెరవేరవచ్చునని యుత్సా హ మినుమడించుచున్నది." అని తనమాటను యచ్చటవిప్పి యారా ళ్ళను తెనగలుగా వేయించి యియ్యుమనుటయు, వశిష్ఠుండు యద్భుత పడి యేమియు బలుకనేరక జూచుచుండ నయ్యరుంధతీసతి భర్తపాదం

ముని కోరంగి యామునియనుజ్ఞ వడసి యారాళ్ళను కసగలుగా నొక్కచోటం బడిన వేయించియుంచె. వశిష్ఠుండు మొదలు నారదునివలన కథ్యాతమై యాకసగలను దీసికొని త్రిలోకంబులకేగి వారలకు చూపించి యరుంధతి యద్భుతశక్తి వారలయెదుట యేకరువుపెట్టుచుండెను. అట్టిశక్తి సంపాదించిన యరుంధతినిజూడ ముప్పురవేల్పులభార్యలును బయలువెడలి వశిష్ఠాశ్రమంబునకు వేంచేసిరి. అట్లువచ్చిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సతులను వశిష్ఠుండు సాదరదృక్కులవీక్షించి ముదితను బిలిచి „ఓకలికీ! వేల్పులు యేలనో మనయాశ్రమంబునకు వచ్చిరి. నీవు వారల సబహుమానంబుగా యర్ఘ్యపాద్యంబులిచ్చి యాదరింపు” మనుటయు, నాపతివ్రతామతల్లి వారలనీక్షించి „ఓవేల్పులారా! వేల్పుపడతుకలారా! నిర్హేతుక జాయమానకరుణాకటాక్షంబుచే మీరలిట్లు వేంచేసితిరని యెన్నెద. భక్తుల యుపవసించినమాత్రముననే భవదర్శనములుగావు. అట్టియెడ నీదీనులయెడ ననుగ్రహంబుంచుటచే వేంచేసితి”రని యనేకవిధంబుల స్తోత్రంబులుచేసి నిలిచిన యరుంధతింగని యాముప్పురు దంపతులిట్లనిరి. „తల్లీ! నీపతివ్రతాప్రభావము నారదునివలన విని, భవద్దర్శనంబుచేసి యేగనుద్యుక్తులమై నిన్నుగాంచి ధన్యులమైతిమి. లోకంబునగల పతివ్రతల నెన్నుటలో నిన్నెన్ని యితరుల జెప్పవలెను. దేవులకు దేవిలమైనంతమాత్రమున నేమాయె. నీకు యేమియైనను వరంబులుగావలసిన గోరుమిచ్చెద” మనుటయు, నాయువతి యిట్లనియె. „ఓదేవదేవులారా! మీదర్శనమాత్రంబున పూర్వపాపంబులు నశించె. అంతకన్నను వేరొద్దియు వరంబువేడ” నని బలుకుటయు, నాదేవులిట్లు ప్రత్యుత్తరంబొసంగె.

„ఓతల్లీ! ఈదినము మొదలు నీపదారవిందంబులు ధ్యానంబునేయువారలు దీర్ఘితంబులంబొసి యాయుర్వృద్ధియు పుణ్యలోకంబును బొందుదురు. మఱియునిన్నెవ్వారేని దంపతులువివాహకాలంబునపూజించి

మొక్కలేని యట్టివారు యిహలోకము యిష్టైయిశ్వర్యంబుల తులతూగి పుణ్యలోకంబునకుఁ బోదురు. అని యామె ననేకవిధంబుల బొగడి యయ్యెడనుండి నిజనివాసంబులకుఁ జనిరి.

కావ నోసాధ్వీమణులారా! ఏభక్తిచేత నీపరమ పతివ్రత కొండ రాళ్ళను గుగ్గిళ్ళగా మార్చుటయును, త్రిమూర్తులభార్యల తన సన్నిధానంబునకుఁ జేరుటయును, ఏమహాత్వంబుచేత నూతన వధూవరులు నీమెసందర్శనంబున సద్గతినంద వరంబిచ్చెనో యట్టి మహాత్వంబు మీరలలవడజేసుకొని పతివ్రతలు గండు.

అరుంధతిచరిత్ర సంపూర్ణము.

---

# సరసచరిత్రము.



పూర్వకాలంబున బృహదుండను నొక్క మహామహుండు కలండు. ఆతనికి సురూపసుందరియు, సుగుణసంపద సమన్వితయునగు సరసయను భార్యకలదు. ఆమె త్రిలోకంబులు మెచ్చునట్లు పతిని పరబ్రహ్మముగభావించి నిర్మలంబైన చిత్తంబుతో నతని ననేకవిధంబుల బూజించుచు, యతని మాటకడుగుదాటక భర్తమనంబు రంజిల్లునట్లు మెలగుచు భర్తృపాదారవిందంబులు భజింపుచు సదా మెలఁగుచుండెను.

అట్లుండగా నొకానొకదినంబున మహిమాన్వితచక్రవర్తి యగు నొక్క మునిమూర్తి వారల యాశ్రమంబునకువచ్చి వారలచే యర్ఘ్యపాద్యాది విధులంది మిథున దంపతులబోలియున్న వారలఁజూచి యిట్లని పలికె.

,,మహానుభావా! బృహేదా! నీవు నాకు యీ రోజున సుభిక్షం బగునట్లు భిక్షంబు బెట్టుము. ఆకలిదీర యారగించి నీకులంబు యశంబు జాటెదను. ఏకాలమునందైన నీబోటి మహనీయులు దలంచిన నా కోరి కలు సఫలంబులు కాకపోవు" యని యనేకవిధంబులఁ బ్రార్థించిన ,,యోమహానుభావా! నీబోటి యోగీంద్రులు నాబోంట్ల గృహంబు లకు వచ్చుటె యరిది. అట్టి భవదభీష్టంబులు మాబోంట్లు దప్పక నెర వేర్చవలెను. కాన నోముని శిఖామణీ! నీవలయు పదార్థంబులు మత్ప్రా ణనాయకి యగు సరసకుంజెప్పిన యామె పచనంబు గావించును." అని యనిన మానీంద్రుం డట్లు కోరిక వీరికలెత్త యిట్లు వాకొనియెను.

,,మానిచంద్రమా! నాకిచ్చు యాహారంబులో తేనెయరటిపండ్లు తప్పకుండా యుండవలసినదే? గాన వెంటనే తేనెయరటిపండ్లు తెప్పించు" మనియెను.

,,ఓయోగపురుషా! లేనికాలంబులో తేనెయరటిపండ్లు యెట్లు తెప్పించుమనియెదరు. ఎట్టికోర్కెయైనను దీర్చెదనని నేను తొలుతనే బలికితిని. గాని యెట్లు తేనెయరటిపండ్లు తెచ్చెదను. తేనెయరటిపండ్లు దెప్పించలేని నాతపఃఫలంబు గాల్పనా? యని చింతించు నయ్యవసరం బున సరససరసకుంజేరి ,,ప్రాణనాథా! చింతింపఁ బనియేల? మీయాజ్ఞ యగునేని నేనా తేనెయరటిపండ్లను సృష్టించెదను. ఆజ్ఞ యీయ వేడె దను." అని యా పతివ్రతాశిఖామణి యానతిచ్చెను. వెంటనే యాతఁ డు ప్రాణనాయకి సాహసంబునకు మెచ్చి, యానతిచ్చుటయు యామె యాయరటిపండ్లను సృష్టించెను. అంత నాఫలంబులతో నాతనికి యాతి థ్యమొసంగి యానందింపఁజేసె. ఆమునీశ్వరుండంత పరమానంద భరితు డై యామె ప్రభావంబునకు మెచ్చి యథేచ్ఛంజనియెను.

ఓహో! కాలముగానికాలములో తేనెయరటిపండ్లను సృష్టించగల మహాత్మ్యమును సంపాదించఁగలిగిన సరసపాతివ్రత్య ప్రభావమునుఁ గాంచి భార్యయట్లు లభింపఁగొనిన భాగ్యంబునకు మేరయుండునా ? భర్తను గొలిచి పోఁగదా సరసయరటిపండ్లను సృజించి యోగిని యానందింపఁ జేసినది. మీరుకూడ సరసంబోలె సత్పతివ్రతలుగండు. సత్కార్యా చరణ మాచరింపుడు.

సరసచరిత్ర సంపూర్ణము.

---

## నళినీదేవి చరిత్రము



ద్వాపరయుగంబున దొల్లి యొక సుందరదేశాధీశ్వరుండు నళిని యను నొక్క సుతాసుందరిని గనియెను. ఆమెయెవ్వాది గుణంబులను నొక్కముద్దగాఁజేసి విరించి సృష్టించెనో యనఁ నొప్పుచుండెను.

అట్టి కన్యాలలామంబు శుక్లపక్షశుధాకరునిచందమున దినదినాభివృద్ధినొంది యంతఃపురంబున యానందభరితయై యొప్పారుచుండెను.

అట్టియెడ రాజాధిరాజులందరును నీమె సద్గుణ సంపత్తులు విన్నవారగుటచే దానిం బాణిగ్రహణంబును గోరినవారై వారివారి యభిప్రాయంబులను యామెదండ్రియగు నళమహారాజునకుఁ దెలిపిరి. అట్టి రాజపుత్రులంగాంచి ‚‚ ఓ రాజకులావతంసులారా! నాబిడ్డయగు నళిని తాను దనయభిప్రాయంబును పతిగావలయునని యేకాలంబునఁగోరునో యావును దానిది ప్రవృత్తి ననుసరించి నలయసన్నాహం బాచరించెదను. గాని యనామత్యా నాకునై వివాహంబు చేసికొమ్మని

బోధింపనొల్లను. నీవాకోరినను వినుమంతయును ఫలంబు గలుగఁబోదని సుతెలిపిన వాక్యంబులాలించి, రాజపుత్రిక సిగ్గుపొంది, నెలవులకుం జనియె.

ఇట్లు గొంతకాలముగడువగా నాయింతి కంతుకేళిందేలవలెనను కోర్కెగలిగి "నేను పతినిగోరియున్నా"నని నాతండ్రిగారి కెఱింగింపు" మని చెలులతోఁ జెప్పుటయును, నాచెలులట్ల కావించిరని రాజుకడకేగి భా రతీభాగ్యభర్తులతో రాజు కెఱింగించిరి. రాపతి మోదంబున మంత్రిప్రధాన సామంతులతో నాలోచించి తగువరుం డెందున్నాడని యరయుచుండు సమయంబున నొక్క భూసురుండా సభకేతెంచుటయును, గూర్చుండ భా సనంబునియమించి యంజలిబద్ధుండై యిట్లు ప్రశ్నించె.

"ఓస్వామీ! యెన్నడునురాని తమరేకతంబున యిట్లువేంచేసితిరి" యని యనేకవిధములం బ్రార్థించిన నాభూసురుండిట్లనియె. "నేను వచ్చినకార్యం బతిస్వల్పము. నేను యవివాహితుండను. నీవద్దనుమాన నటదరియగు నొక్క బాలామణి గలదని విన్నవాఁడనై, యామెను నాకిచ్చి వివాహంబుచేయ నిర్ధరింపవచ్చితిని" అనుటయు రాజట్లుకాక యని "మహాత్మ! నీవు యంతఃపురంబు బ్రవేశించి యాకన్యయొక్క యనుమతివడసి ముద్దుటుంగర మానవాలుగా దెమ్మ"ని యాతని యంతఃపురంబునకనిపె. యాతఁడు సన్యాసియగుట రూపమునందు గొంత గొఱవడియుండుటచే మన్మథునివలంచి యాతని రూపమునుగైకొని యామెయుండు యంతఃపురంబునకుఁ జని యామెనుగాంచి యామె మనోభిప్రాయమునుగాంచి ముద్దుటుంగరమును యానవాలుగా రాజున కిచ్చెను. మన్మథునిచేగొన్న రూపంబుమాయమై రెప్పటియట్ల తన మునుపటి రూపంబుతోనున్న మునినిగాంచి దశమహంబున రాజిట్లు తలపోయింప సాగె.

"అయ్యో! నాకూతురువద్దకు నీతని బంపిన కురూపియు ముసలి వాని నను నెపంబున శారదోలుచున్నాఁడిటని. అట్లుగాక యామెయే

నీతని వరించినది. పూర్వకర్మ మనుభవింపక తీరునా" యని మనం
బున యోచించి కూతునకు కబురుపంపి యామె నడుగగా ,,తండ్రీ!
యీతఁడు నావద్దకు వచ్చునప్పటికి యన్నివిధముల నాకెన్నికకు దగిన
వాఁడై యుండె. ఇప్పుడేలనో యిట్టి ముదుసలిరూపంబును ధరించె.
అయినను రాజకన్యకలకు యాఁడి దప్పు టనుచితంబుగాన నన్నిచ్చి
యీతనికే యుద్వాహంబు గావింపుము" అనుటయు దండ్రి సమ్మతించి
యొక్క-శుభలగ్నంబున నన్ని నాతనికిచ్చి వివాహంబు గావించె. ఇంతటి
రూపవతిని దాను బెండ్లాడగలిగినందున కుబ్బుచు నామౌద్గల్యమహాముని
దన భార్యను జేకొని యాశ్రమంబునకు వెడలె.

అట్లు తపసియగు దనభర్తకు వుపచర్యలు చేయుచుండ మౌని
యీమె చిత్తవృత్తి బరీక్షింపఁగోరి శరీరమంతయు వ్రణంబులు గల్పించు
కొని కండలు వ్రేలాడ, చీము నెత్తురులు జీరాడఁ బొర్లుచు నున్న భర్త
నుజేకొని తటాక బునకరిగి చీమునెత్తురులు గడిగి నెత్తిపైనుంచుకొని
యాశ్రమంబునకుఁ దెచ్చి యందుబరుండఁబెట్టి కాయకసరులేరి తెచ్చి
నాథునకుఁ దినిపించి మిగిలిన ఫలాహారంబులు దాను భుజించుచు
యిష్టాగోష్ఠి గడపుచుండగా యాపరీక్షయు జాలక కాళ్ళవ్రేళ్లును చేతుల
వ్రేళ్ళును యూడిపడునట్లు జేసెను. అంతకును నమ్మహాపతివ్రత యాతని
తోడిదే లోకమని భావించుచు శేషభుక్తియే యనుభవించుచుండె.
అట్లుండ మౌని ,,ఓసీమరాత్మురాలా! నిన్నువివాహంబాడినదాది యిట్లు
రోగంబులు దగులుకొని నాశరీరమంతయు బాడయిపోయె నీమూలము
న నింత గలిగె, ఎందుకీదుష్టవివాహముగొంటినో" యనియనేకవిధంబుల
దూషించియోగనిష్ఠాగరిష్ఠుండై దన్ను బలుకరించకగావలయు ఫలంబు
లఁగోసికొని రమ్మ"నుటయు, నామె యట్లుకాకయని ఫలంబులనిమి
త్తమేగె. మాయాజాలపద్మవ్యూహానేర్పరియగు మౌద్గల్యుఁడు దన
యాశ్రమంబువిడిచి కొండొకయెడకేగి దపస్సుచేయుచు దనసమీపమునుండి

పుట్టలు మొలచు నట్లు దన మాహాత్మ్యముచే గప్పుకొనియుండె. అదారి నే నారదుండే తెంచుచు నళినినిఁ గని ,, అమ్మా! యీపుట్టయందు మెరుఁగుడు పురుగులఁ బోలె బ్రకాశించుచున్న గాంతులగాంచు మన్నట యు నామె వాటినింగని ,, మహాత్మా! యివి యేమి యనుటయు నానార దుండు రెండుపుల్లల నామె చేతికిచ్చి పొడువు మనుటయు నామె యట్లు చేసెను. ఆరెండు రంధ్రములలోను బొడుచునప్పటికి ,, చంపితివే చండ శాసనురాలా,, యనుటయు వెంటనే నారదునిచే నదుపదేశమునంది మాఙ్గల్యని మదినుంచుకొని బ్రహ్మ విష్ణు మాహేశ్వరుల ధ్యానించిన వారు సాక్షాత్కరించియు తనికి నవయౌవనమును బ్రసాదించి లోచనగో చరంబు నొసంగి యెవరి నెలవులకు వారు జనిరి. అంతట యాదంపతు లు మిధునదంపతుల బోలె హాయిగా గాలంబు గడపుచుండిరి.

పోయిన కండ్లు దెప్పించిన పాలఁతియు, మనోనాధునకు నవయౌ వన మంకురింప జేసిన పాలతియునగు నీ నళినీ ప్రభావమే ప్రభావమో తెలుసుకొను డమ్మలారా!

నళినిదేవి చరిత్ర సంపూర్ణము.

# సునీతి చరిత్రము.

చతుస్సముద్ర ముద్రిత మహీవలయంబును దొల్లియుత్తాన పాదుండనుమహారాజుబరిపాలించుచుండెను. అత డట్లు గొంతకాల మేక ఛ్ఛత్రాధిపత్యముగా జగంబేలుచు సునీతి, సురుచియను యిద్దరు భార్యలతో, బహున్యాయంబుగాఁ బరిపాలించుచుండెను. అందులో

సునీతి సునీతియే సురుచి సురుచియే నామధేయములను బట్టియే నామ్యములేర్పడినవి. రాజుసురుచిలోలుఁడేగాని సునీతిని మాత్రముఁ జూడకుండలేదు. సునీతిపతియే యుమాపతియను తలంపుతో నిత్యము పతినామమే జపించుచుఁ గాలంబుగడుపుచుండె. ఇట్లుండ సునీతికి సుపుత్రుండగు ధ్రువుండుద్భవించె, సురుచికిఁ గూడానొక్క కుమారుండుపుట్టె. సురుచి యెవ్వఁడును యుత్తానపాదుని మన్మథక్రీడలచే మరులుగొలుపుకొని మర్యాదగాఁ జీవించుచుండెను. సునీతి యోదన నీతిమార్గమును దప్పక కాలంబు ద్రోయుచుండెను. ఇట్లుండ సింహాసనాసీనుడై యున్న మహారాజు దొడలపై ధ్రువుండు గూర్చుండుటయును సురుచి యదిగని ధ్రువునిరెక్క బట్టియీడ్చి ,,యోరీ నీకుసింహాసనార్హతయే గలుగవలెనన్న నీవుఘోరమగు తపంబుజేసి పొందుము, పొమ్మనుటయు నాబాలుండు చేయునదిలేక తల్లివద్దకరిగి దండ్రివద్ద జరిగిన యావద్వృత్తాంత మెఱింగించి తాను దపస్సునకుఁ బోయెదనని చెప్పెను. అందునకుఁ దల్లి చాలగచింతించి యిట్లు వాపోవదొడంగెను.

,,నాయనా! లేక లేక కలిగిన నీకీయరణ్యవాసము గతియే పట్టెనా రాజ్యంబు పూజ్యంబైనను కనీసము తాతగారిరాజ్యముండెనుగదా! యేటికింత చిన్నదనంబులో దపంబుచేయనరిగెదవు. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డవు. నిన్నువిడచి నేనెట్లుజీవింతును. అక్కటా! పాపపువిధీ, నీచెయిదము లద్భుతములు, నీమాహాత్మ్యములనంతములు. నీవు కరుణించిన యణువు మహామేరువగును. నీవలిగిన మహామేరువు యణువుగామారును. నాచిన్నిబిడ్డని, చిరుతపాపని, నట్టడవుల పాల్సేయకట్టడిచేసితివా నేనుదెలిసి పతికి నుమంతయు నపచారంబుజేసి యెరుంగనే, బిడ్డడుగూడా? పండ్రెండేండ్లుదాటినవాఁడుగాఁడేని వాఁడపచారమున్నమేమో యెఱుంగడేని, అట్టితరిమేము యెవరికి యపచారము చేసి

తిని..ఎందులకిట్టిశిక్ష, రక్షించవలసిన తండ్రియే శిక్షించుట కొప్పుకొ
న యికరక్షించువారలెవరు కంచెయే చేనుమేసినగలదెదిక్కు, యను
నట్లుగానాథు దూరకొనుట సవతిసాగించుటయేమో మాగతియెట్లు
న్నదో యట్లుగాకపోదు. యనికుమారునకు సదుపదేశంబు లొసంగి
దపస్సునకుంబోవుట కనుమతియిచ్చెను. చూచితిరా! యవ్వీరమాతను
సులక్షణంబు, పతినిమాత్రము తానెదబాయక యెన్నికష్టంబులు వచ్చి
వను యెదుర్కొనుచు కాలంబు వెళ్ళబుచ్చుచుండెను.

అంత ధ్రువుండు మనంబున సంతోషిత తరంగిత స్వాంతుండైదవం
బునకు జననజననియొద్ద శెలవుబొంది శ్రీమన్నారాయణునిం గూర్చి ద
పంబు సేయుటకయి యలు వెడలెను. అట్లువెడలుచు గిరిగహ్వరంబులను నదు
లనుదాటుచు బోవుచున్న ధ్రువుని యంతరిక్షమునుండి యాక్షించు
చున్న నారదుండు చటాలున భూమికెతెంచి ధ్రువునిం గనుంగొనిం
యో ధ్రువా! యెచ్చటికి బోవుచుంటివి- పిన్నతయసున్కుండవగు నీవేల
యాగిరి గహ్వరంబులదిరుగుచున్నావు.

క్రూర మృగారావసంకులమగు నీ యరణ్యము యాటపట్టని
యెంచితివా? మహారాజ ముద్దుబిడ్డండవగు నీవీ మహాటవులలో
సంచరించుటా! యేటికిట్లు హంసతూలికా తల్పంబుల విడనాడి యసు
వుల యునురు పెట్టుకొని యెదవు" యని నారదుండనేక విధంబుల యాత
ని వృత్తాంతంబడుగుటయు నాధ్రువుండిట్లానతిచ్చె-

బ్రహ్మమానసపుత్రా! నేను నాదండ్రి సింహాసనారూఢుండై యుండగాం
బోయి యాతనిం దొడలపై నధివసించితిని. అంత నాపినతల్లి యుగ్రం
బగు కోపంబుగదురార గద్దించి యిట్లు పలికె. ఓధ్రువా! నీకు రాజ్యం
బు వలయునేని యుగ్రంబగు దపంబుచేసి విరించి నిమెప్పించి యాతనిచే
వరంబులం బడసి సింహాసనా రూఢుండవగుము! లేకున్నమానుము. అం

తిరేగాని నీవు నేనున్నంత కాలము రాజ్యంబు నేయజాలవు, ఇది మా దినికి చేయిష్టంబగు తెరంగున మెలంగు మనుటయు నంతనేను యిట్లు గహనాటవుల గ్రుమ్మరవలసిన వాఁడనైతిని. నేనిందు వచ్చుట కిదియే కారణము. కాన నో మునిశిఖామణీ! నాకు మంత్రోపదేశముఁజేసి మహిమాన్వితునిఁగావింపుము. ౹౹ అనుటయు నారదుండట్లు కాకయుని మంత్రోపదేశముఁజేసి దన దారింజనియె.

అంతధ్రువుండు యుగ్రంబగు దపంబుచేసి శ్రీమన్నారాయణుని మెప్పించి యాతనిచే వరంబులఁ బడసి దన పట్టణంబు జే' దల్లికి నమస్కరించి, దండ్రికి జోహారు లొనరించి నిలిచిన ధ్రువుంగని యుత్తానపాదుండు మూర్ధంబును మూర్కొని కొడుకును దన యంక పాళిం జేర్చుకొనెను. కొండొక సమయంబున యుద్ధంబు దటస్థించుటయు, యందున ధ్రువుండ ద్వితీయుండై జయంబు గొనుటయు దేవతలు దుందుభులు మ్రోగింప కొన్ని వేలేండ్లు రాజ్యంబు పాలించి దల్లియగు సునీతి నేమరక ధ్రువ నక్షత్రంబుగా వెలుగొంది, ధ్రువమండలమును నిర్మించుకొన్నవాడై కీర్తిగన్నవాఁడు.

పతివ్రతగర్భంబున జనించిన పతితపావనుండగుటచేత పరరాజ్యంబులఁ జయింప గలిగి. తన యశశ్చంద్రికలు దశదిశలు బ్రాకనేటికిని మానవులచే ధ్రువమండలమనియు యవియే యాచంద్రతారార్క స్థాయిగా నుండునట్లు నిర్మింపఁజేసిన సాధ్వీమతల్లి సునీతి చరిత్ర మాచరణీయమని భారతసతీమణులెన్నదరు గాక!

సునీతి చరిత్రము సంపూర్ణము.

# జయప్రద చరిత్రము.



ద్వాపరయుగంబున విశాలనగరంబను నొక్క పురవరంబును సోమదత్తను మహారాజు నిత్యసత్యవ్రతుండై, మనునీతిఁ దప్పక బరిపాలించుచుండెను. ఆతనికష్ట యిశ్వైర్యములును దాసదాసీజనంబులును. గాయకశిఖామణులును గలిగియున్నప్పటికిని పుత్రపుత్రికాసంతతి యొుంటు మాత్రముఁ గొఱంత వడియుండెను. ఆతనికిపంకజవల్లియను సుగుణములరాశిభార్యగాయుండెను. ఆమెను పతిసేవయే గతియని మనంబుగలది. ఇట్లుండ. భార్యాసమేతుండై గహనాటవుల మహర్షులనన్నిటిని దర్శనంబు సేయ వెడలిరి. అట్లుయరణ్యంబుల దర్శనంబు సేయుచున్నయెడ నొక్కమహర్షితిలకుండు వీరల కోర్కెగనుగొన్నవాఁడై, పుత్రకామేష్టి యనుయాగంబును జేయించి యందుదయించిన పాయసాన్నమును పంకజవల్లి కొసంగి మహర్షి దనదారింజనియె. అంతగొన్నిదినంబులకు పంకజవల్లి గర్భవతియై, నొక్కయాడశిశువును. నొక్కమగశిశువును గనియెను వారల జన్మదినోత్సవంబున భూసురులసత్కరించి, భూరిదానంబు లొసంగి గాలంబుగడవునెడ పుత్రకామేష్టిజేయించిన మునులేతెంచి యాబిడ్డల సువర్ణవళ్ళెరంబునఁ గొనితెమ్మని తెప్పించి యాబిడ్డలకు ‹‹సుమతీంద్ర›› దని మగచిన్నవానికిని ‹‹ జయప్రద” యనియాడుదానికిని నామకరణంబొనర్చిరి. అంత సోమదత్తమహారాజు బిడ్డలనువిద్యాభ్యాసమున కొప్పగించి బహుజాగరూకతతో విద్యలునేర్పించుచుండెను. ఇట్లుగొంతకాలంబు గతించ జయప్రదవయసువచ్చినదై, చమత్కారవల్లియను చమత్కారవచోరచనలచే నొప్పునొక్కదాసిచే పురాతన చక్రవర్తి రూపశీలంబులును. యర్పితియ వీరత్వంబును నాలకించి యాతని

యందు మనంబుంచెను రూపమున మన్మథుండును, తేజమున సూర్యుం డును, బలమున హిమవంతుండును, ధీరమున మేరువును, శాంతమునస ముద్రునిం బోలియు, నైశ్వర్యమునకుబేరుండును దానమునకర్ణుండును యందమున మహావిష్ణువును కోపంబున శంకరుండును నై యున్ననాతని నేపంకజాననకోరరు. అట్లు మనంబిడి యామె నానాటకృశించుటతప్ప మ నోభావంబెవరికిని దెలియనిచ్చుటలేదు లోనమాత్రము పురూరవునిం గలువుమని భగవంతుని వేవిధంబులం బ్రార్థించుచుండెను.

ఇట్లుండ నొకనాడు దాదులలో నొక్క తెఱయప్రద సంగతిసూ త్ర్మదృష్టిం గ్రహించి దండ్రికెరింగించిన యాతండును స్వయంవరము జాటబంచెను. ఆసమయంబున రాజాధిరాజులందరును స్వయంవరమున కేతెంచిరి. అవచ్చినవారిలో పురూరవుండును గూడాగలడు అట్లుజేరి న రాజబృందమువీక్షించి సుమతిండుస్ట్రీ డిట్లనియెను. "ఓరాజ శిఖామ ణులారా! నేనిపు డొక ప్రశ్నయడుగుచున్నాను. దానికిం బ్రత్యుత్తర మిచ్చువారెవరో నాతోబుట్టువును వివాహమాడవచ్చును. మొగవా డుయాండరిగాను, యాండది మొగవాడుగానునై వంశమున వృద్ధిచేసిన వారున్న నాసహోదరిని వివాహమాడవచ్చు" ననుటయు పురూరవుండి ట్లుపలికెను.

"ఓరాజశేఖరులారా! అట్టివాఁడను నేనే గాన నాకామెనిచ్చి వివాహంబు గావింపు" మనుటయు నట్లగాకయని యుద్వాహంబతి వైభ వంబునం గావించిరి. అట్లు ద్వాహమాడి నిజభార్యాసమేతుండై దన పట్టణంబునుజేరి సుఖంబుండెను. అప్పరమ పతివ్రతామణియు భర్త పాదంబులే మరక పూడిగంబులుచేయుచు భర్తనామమే యీశ్వరధ్యా నముగా నెంచుచు జపించుచు సదా కాలము వెళ్ళందీయుచుండెను. ఇట్లుండ పురూరవునకు శనిమాహాత్మ్యముచే రాజ్యంబు పూజ్యంబగు

టయు యడవులc బట్టి యాcకలిదప్పులచే బాధనొందుచు నొక్క-చోటcబడియుండెను. అంతవీరిబిడ్డలు మిక్కిలియాక్రందనము సలుపుచున్న యయ్యాక్రందనము నాలించిన యానందుcడను నొక్కకూలిమేస్త్రీ కొందరకూలీలcబంపి యరసిరమ్మనుటయు నాకూలీవేగి యాబిడ్డల సంగతియు, యచ్చటగల భార్యాబిడ్డల సంగతియు నెరింగించిన వారు. మధ్యాహ్నికమునకుc దెచ్చుకొన్న యన్నము వారికిబెట్టి కులగోత్రనామంబులడిగిరి. వారలకిట్లు ప్రత్యుత్తరంబొసంగె.

,,ఓ అయ్యలారా! నేను పురూరవచక్రవర్తి యొద్దలెక్కలను వ్రాయుగణికుండను ఆరాజు రాజ్యంబు పోవుటచే యెందైనను యేగిజీవింపవలెనను కుతూహలంబున నిందువచ్చితిని. అనినుడువుటయు యానందుcడిట్లు ప్రత్యుత్తరంబొసంగె.

,,అయ్యా! మేమందరమును కూలిచేజీవించువారము. మాకుగలిగినదానిలో మీకుc దగినసహాయముc దప్పకయాచరింపcగలము గావున మాకులెక్కలు వ్రాయుచు మాతోడనేయుండుము. అన్నవస్త్రములకులోటురాదని యాతనియొడంబరచి వారివద్దనేయుంచుకొనిరి

ఇట్లుండ సోమపురియను పత్తనంబున పేరువహించిన నవకోటినారాయణుcడను శెట్టిబహుధనాఢ్యుడై గాపురంబుండె, అతని ధనము నానాటcక్షీణించుటచేc బంధువులc బిలిపించి వారినడుగగాయిప్పుడున్న ధనములో గొంతనియోగముc జేసితివేని మీభాండారమునc గలధనముయుగముందుc గదలబోదు. అనిచెప్పిన యాతcడు తటాకమొండు నియమింపc గుతూహలుcడై యాయూరికిc బెద్దమేస్త్రీయను యానందునిc బిలిపించి కొలనుత్రవ్వించ నారంభించెను అట్లుదినదినము మొదటికూలివారు పుచ్చుకొనుచు గణికునకొక్కకూలి ముజరాయిప్పించుచుండిరి. ఇట్లుండమొదటికూలి వారుదీసుకొనవక్కరలేదు. ఇంట

ల యాఁడవాళ్ళను కూలిదీసికొనుటకుఁ బంపించమనుటయు వారట్లు యాడవారినే కూలికిఁ బంపించుచుండిరి. వారలచేతికే భత్యంబులిచ్చి పంపుచుండెను. ధర్మచింతనఁగల శెట్టిగారికి శనిగాడేసింటనుండుటచే విూకర్ణికుని భార్యయేదియని యడిగి జయప్రదను కర్ణికుని భార్యగాఁదెలుసుకొని దాళరాని విరాళి నామెను లోనకుఁబిలిచి గమకింప నుంకించిన యందుకు నొకపెట్టెలోఁ దూరినేనే పతివ్రతనగుదునేని నాభర్తయే సత్యశీలుండగునేని యీపెట్టె ఖడ్గములచే లోహముచేబగులక, యగ్నిచేగాలక వానచేదడువక, సముద్రమున మునుగక, నాభర్త వచ్చి దెరచునందాక యేరికిని రాకుండుగాక'' యనిబలికి దలుపుమూసుకొనెను ఇదంతయు జూచుచున్న శెట్టియద్భుతపడి యినుపగొడ్డళ్ళచే నాపెట్టెను బగులగొట్టనాజ్ఞనిచ్చెను. అట్లుచేసినను యదిపగులలేదు ఆఖరుకు యాపెట్టెదగులఁబెట్టనాజ్ఞయిచ్చెను. అట్లుచేసిన యదిదగులబడలేదు. అతిభయముతో శెట్టిగారు గజగజవడకుచు యీపెట్టెను దీసుకొనిపోయి యొకానొకబండదానికిఁగట్టి సముద్రంబునఁ ద్రోయబోవ లోనున్న జయప్రద యిట్లు ప్రత్యుత్తరంబొసంగె. నీవు యీపెట్టెను సముద్రంబులోఁ ద్రోచినంత మాత్రమున నేమియుఁ బ్రయోజనము లేదు. ఈపెట్టె శిథిలంబుగాబోదు. నాకు యేడున్నరసంవత్సరములు సద్వ్రతంబొండగలదు. గాన యీయేడున్నర సంవత్సరములును దీనిని భద్రంబుగా గాపాడుము. తదనంతరము జూచుకొనవచ్చునని నుడువుటయు యీపెట్టెనయందమానుదీవులలోనికిఁ దీసికొనిపోయి యందుంచి యతిజాగరూకతతో గాపాడుచుండెను ఇట్లుండ యిచ్చట చక్రవర్తికి యనేక దుశ్శకునంబులుగలిగి కూలికొరకేగిన భార్యాసందున కూలివారలయింతులనడిగి యామెవచ్చి గదిప్రవేశింపఁగానే యాగదిభగ్గునమండిపోయెను. మేమింతయే యెరుగుదుము. అనివారుచెప్పుటయు యికనిక్కడ నెందుకుండవలయునని యూహించి యిద్దరకుమారులను దీసికొని గహనంబులు దాటుచు

బోవుచుండగా నొక్కయేరు యడ్డమువచ్చుటయు నొక్కబిడ్డను తీంద్రలీఁగకుఁగట్టి యొకబాలుని భుజంబున నెక్కించుకొని యావాహంబు దాటుచుండె. ఇట్లుండ యుద్వేత్తుగా యాప్రవాహము వచ్చి యాబిడ్డను యొడ్డునకుఁ గెదపి యాతని నెత్తుకొనిపోయెను. ఆహా! విధీ ఎంతవాఁడవురా? భార్యనుబాపితివి. బిడ్డలనుచెరియొకదారిజేసితివి. బాలక చక్రవర్తిని మొత్తుకొనిపోవుచుంటివి. ఇంతియేనా నీప్రభావము యింకేమైనను జేయగలవా? అట్లుగొట్టుకొనిపోవుచున్న చక్రవర్తిని వాలుతురు కోలలు చూపించి యొడ్డునకుఁజేర్చిరి. కొందరుమహానుభావులు, ఇట్లుండ తాంద్రతీగతోకట్టఁబడియున్న బాలునిన్ని, యేటియొడ్డు జేరినబాలునిన్ని యొకగొల్లతె దీసుకొని సాగుచుండెను. ఇన్నికష్టములను భవించుచున్నను చక్రవర్తికిశని మాయనిమువకుండుటచే గొల్లగా సంచరించుచున్న చక్రవర్తితలవద్ద నొక్కనగలమూట చోరులు వైచిపోవుటయు శోధకులువచ్చి చక్రవర్తినిదీసికొనిపోయి రాజునెదుటంబెట్టిరి. ఆరాజు యాతని కాళ్లు చేతులు ఖండించుటకుత్తరవిచ్చెను. ఆతలవరులు యాతని కాళ్లు చేతులు ఖండించియేగిరి. ఈతఁడు పెద్దపెట్టు నరోదనముసేయ యారోదనము సరస్వతీదేవి విని భూమికిదిగి హితంబు బోధించి గాయములను మాయము చేసి యమృతపాన మిచ్చి యేగుచుండెను.

ఇట్లుండ నాపురంబున సుగుణమాలఖని యగు దేశికశెట్టియను నాతఁడు చక్రవర్తిని దన యింటనిడుకొని కాపాడుచువచ్చెను. కొన్ని దినంబులకు ఉపరిషియనే నొక్కమహర్షి యచ్చోటు కేతెంచి చక్రవర్తి తేషమంబారసి యాలుబిడ్డలు సహితముగా రాజ్యాభిషేకంబు చేయుమవ్వు గాకయని దీవించి పంపెను. అట్లు దీవించి చెంగియను గొల్లదానింటికిఁజని శిశువుల నిరువురఁ గాంచి వారల నస్త్రవిద్యల యందారితేర్చి. అండమాను ద్వీపమున కేగి యచ్చోట పెట్టెయుమునిచియున్న శెట్టిగారిని గాం

క్షేమము లు విని చక్రవర్తి కింగల దురవస్థల దెల్పిన పెట్టెలో నున్న జయపత్రిద దిగులొంది కడుగుంది దైవవిధినేమిచేయుదును. ఎట్లుగా పరిణమింపఁచేసెద. వోయట్లుగా పరిణమింపఁజేయును. కాళ్లుచేతులు లేక పోయినను పోయె. అసువులు నిలిచిన జాలునని ననుకొను సమయములో శనిమహాత్మ్యము దగ్గుటచే దేవదేవులు దర్శన మిచ్చి యాశని కరచరణాద్యవయవములు పూర్ణంబు జేసి యచ్చటనే దైవికపురమను నొకపురంబును నిర్మించి దాని కితనినిరాజుగా జేసి వెడలిపోయిరి.

ఇట్లుండ అండమాను దీవులలో యీపెట్టెను గాపాడు చున్న నవకోటినారాయణశెట్టి యాపెట్టెను దైవిక పురములో మహాత్ము గలిగిన పురుషుఁడున్నాఁడని దెలిసి కొన్నవాఁడై యాపెట్టెను నెత్తినిడుకొని దైవిక పురము చక్రవర్తి మోలఁ బెట్టి దైవఘలముగల యో దైవిక పురాధిపతీ! యిందుగలయు పతిలలామంబు యెన్నియేండ్లనుండియో యాకలి దప్పలు రోసి జీవించియున్నది మహాత్ము గలిగిన వాఁడవేని యీపెట్టెందెరువుము మనుటయు యాతఁడు దైవధ్యానముచేసిబెట్టెపై జేయవేసెను. వేసివేయుటతోడనే యాపెట్టె దెరువబడెను. అందేమున్నది? తన పత్ని. పత్నిప్రభావమున కచ్చెరువందె. జరిగిన సంగతి దెలిసికొని నారాయణశెట్టిని గూకలిడి బంపివేసెను. అచ్చట చెంగియను గొల్లదానిచే బరిపోషింపఁ బడుచున్న యీయిద్దరబాలుర యుద్యోగము నిమిత్తమిచ్చుటకుఁ దీసికొని వచ్చిన వారల తమ బాలురగా నెరింగి, చెంగికి బహుమాన మొసంగి బంపివేసిరి. ఇంతలో తన పురంబునుండి ధీమంతుండను మంత్రి వచ్చి యచ్చటి వృత్తాంతంబు లెరింగించి యచ్చట వారితో యుద్ధంబు జేయించి యారాజ్యంబు యీరాజ్యంబు రెండును బరిపాలించుచు యిద్దరు తనయులతో సుఖంబుండిరి.

మహామహిమలకు మించిన మహిమ సంపాదించి, ఆకలి దప్పలు రోసి యాంతర్యమున భర్తనామమే చింతనముఁ జేయఁ బట్టియే

చిక్కులు విడిపోయినవి. మీరుగూడా నాథున కెదుర్కొనక జయప్రద వలె నాణ్యములగనులై వర్థిల్లెదరుగాక!

జయప్రద చరిత్ర సంపూర్ణము.

---

# లోపాముద్ర చరిత్రము

పూర్వకాలంబున విదర్భదేశాధీశ్వరునకు సుగుణముల కాటపట్టగు లోపాముద్రయను కుమార్తెగలదు. ఈమె యంతఃపురంబుననుండియే మహాశాస్త్రపారంగతురాలై పతివ్రతలు యెట్లుండవలెనో, తల్లక్షణము లెవ్వరిచేనో చెప్పించుకొనుచు చెలులతో సత్కథాకాలక్షేపము చేయుచుండెను.

ఇట్లుండ నొక్కదివసంబుకుంభసంభవుండగు అగస్త్యమహాముని రాజసభాంతరాళమునకు వచ్చె. ఆమునిని చూచి రాజు యెదురేగి దోడ్కొని వచ్చి యర్ఘ్యపాద్యంబులును, యాసనంబును నియోగించి గూర్చుండనియోగించెను. అట్లు గూర్చున్న మౌనినిఁ గాంచి రాజిట్లనియె. “ కుంభసంభవా! మీరాకచేతన మాగృహంబు పావనంబయ్యె. తమరిచ్చటకు వచ్చుటకుఁగల కారణం బెఱింగింపఁగోరెదను. మీ కోర్కె యెట్టిదైనను నేను దీర్చెదను. “ అనుటయు మునీంద్రుడు” భూపాలతిలకా! నీవు సత్యశీలుండవనియును, యుదారత్వంబున గర్ణుని మించిన వాఁడవనియును దెలిసి నిన్నొక్క కార్యంబర్థింప వచ్చితిని. అనేమందువేని, యొక్కనాఁడు నాపితృదేవతలు ప్రత్యక్షంబై. కుమారా! నీవిట్లు వివాహంబునొల్లక బ్రహ్మచార్యాశ్రమమునందే యుంటివేని మాకు బుణ్యలోకప్రాప్తి గలుగనేరదు. “ అపుత్రస్యగతిర్నాస్తి” యను

వేద వాక్యానుసారము పుత్రులులేనివారికి సద్గతులుండుట యరది. నీవు మా కేడవ పురుషాంతమున నీజన్మించిన వాఁడవగుట నీవు వివాహంబా నర్చుకొని పుత్రులను బడసిననే గాని మాకు ముక్తి లేదు, గాన నీవు వివాహంబాడి మమ్ముద్ధరింపుమని గోరుటయు యాకార్యమునకై నీకూతునర్థింపవచ్చితిని. దాని నిచ్చి పెండ్లిచేసితివా నేను సుఖించెదను, నా పితృదేవతలు సుఖించెదరు. గాన నీతనయనిచ్చివివాహముఁగావింపు"మని గోరుటయు యాపలుకులు రాజు చెవులకు ములుకులైనాట మూర్ఛాక్రాంతుఁడయ్యెను. అంత మంత్రులు సామంతరాజులు యాతని శీతలోపచారంబులచే సేదదేర్చి యంతఃపురంబునకుఁ బంపిరి.

పిమ్మట గొంత వడికి రాజేంద్రుఁడు మంత్రి సత్తములఁజూచి యిట్లుపలికెను. గాంచితిరా మంత్రిప్రధానామాత్యులారా; యాబడుగు బాపనికి నాకూఁతునిచ్చి వివాహంబు చేయవలెనంట. తానెక్కడ? నాకూతురెక్కడ? యనుటయు మంత్రిప్రధానులిట్లనిరి.

"మహారాజా! యాతఁడు మహామేరు భూమికణచి సూర్యచంద్రుల గతుల కడ్డంకు మాన్పెను. సముద్రమునఁగల నీరంబునంతయు నొక్క పుడిసిలుగ్రోలెను. ఇంద్రద్యుమ్న మహారాజును మదగజంబుగాఁ బుట్టశపించెను. పొట్టివానికి పుట్టెడు బుద్ధులన్నట్లు యీతని పొట్టంతయు యుపాయముల పుట్ట ఈతండలిగెనేని ముల్లోకంబులు తల్లడిల్లు, ఈతఁడనుగ్రహించిన ముంగొంగు బంగారమగును. అట్టిమహాత్ముని నింతబేల తనంబుగాఁ జూచినప్రమాదంబు సిద్ధంబు, అని నుడువుటయు యంతలో లోపాముద్ర రాజసభకేతెంచి దండ్రిదొడలపై యధివసించి, రాజునకిట్లనియె. జనకా! పూర్వజన్మ సుకృతంబుచేత నిమ్మునిని కన్యనిచ్చెదనని ప్రార్థింపకయే వచ్చెను. అట్టితరి నన్నితనికిచ్చి యశంబు జేకూర్చుకొనుటయే పాడి. పరమ తపోధనుఁడు యిట్టిమహానీయుం డలిగెనేని మనకుబుట్టుకలులేవు





గావున నన్నాతని కిచ్చి వివాహంబు చేయుము. అతఁడు దవ్వ యితరు డెట్టి నవమన్మధుండైనను నేనొల్లను, గాన నన్నాతనికిచ్చి వివాహము చేయుము అని యొక్క యితిహాసంబుజెప్పఁ దొడంగెను.

ద్రొల్లి మాంధాతయను మహారాజు నొద్దకు సౌబరియను నొక్కమహాముని యేతెంచి అయ్యా! నీకుగల పదునార్గురు కుమార్తె లలో నొక్కయాపె నాకిచ్చి వివాహముఁ చేయుము. అని వేఁడుటయు నాభూపాలుండునుఁ నీవలెనే చింతాక్రాంతుడై మునీంద్రా! నాకుమా ర్తెల జూపెద. వారిలో యెవ్వతె యైన నిన్నుఁ గోరిన యాపెను వి వాహమాడుమని యీవికృత జడదారిని వారెవ్వరు వరింప నొల్లరని యుద్దేశముఁ దోడ్కొని జనిన యాకన్యకామణులు పదునార్గురును యీతనినే వలచి వివాహంబాడిరి. గాన నన్నాతనికే యిచ్చి వివా హంబొనరింపు మనుటయు నట్లుకాకయని నా లోపాముద్రను యగ స్త్యునకిచ్చి వివాహంబుగావించెను. ఆతండు యత్తవారింటి యందే యుండుచు ««మగువా! నీవునాకు జాలినంత పాలు ద్రావనిచ్చెదవా యనుటయు నాలోపాముద్రి యిట్లువలికెను.

సముద్రంబునువుడిసిటగ్రోలిబిడిచిన తమకుఁజాలినంతక్షీరంబులి య్యలేను, గాని నాయోపినకొలంది యిచ్చెద సేవింపు డనుటయు యాతడును యియ్యమని గోరుటయు నొక్క సువర్ణపాత్రిదెచ్చిదాని నిండుగ్గా క్షీరంబులుంచి యక్షయంబగు నట్లు పతిని నెమ్మదిలో దలచి యాతని కందిచ్చెను. అతఁడు మాటిమాటికిని ద్రాగుచుండుట యే ఎంత త్రాగినను దరుగకుండుట కచ్చెరువంది యాపె మహా త్మ్యమును మదిలో శ్లాఘించు కొనుచు యత్తవారింట కెలవంది దన యాశ్రమంబునకు జనుచుండెను అట్లుజని నారచీరలుతో గా లంబు గడవుచున్న తరి నొక్కయాపె నాపె నిట్లు ప్రశ్నించెను అమ్మా! తులలేని భాగ్యభోగములచే యలరారు పుట్టింటిని విడిచి యా

వనాంతరములలో నుండనేల? నీభర్తతోనే యచ్చట నుండరాదా! యని నుడువుటయు యామెపతి కోడిదే భాగ్యమని యామెకు సమాధాన మిచ్చి గాలంబు గడపుచుండు తరి నాపతివ్రత చాలాకాలైనొక్క మగశిశువును గనియెను. అంత నమ్మహాముని పరమానంద భరితుండై భార్యంజేరి ఋషులకెల్లను షడ్రసోపేతంబుగ యన్నంబు లిడుమను టయు యామెయునట్లు దనమహత్తుచేఁ గల్పించిషడ్రసోపేతంబుగా వడ్డించెను. ఆపదార్థంబులు పొట్టలుపగులునట్లు మెక్కి యాపతివ్రతామణి ప్రభావమునకు మెచ్చి నిజనివాసములకుఁ జనిరి.

గాన యింతులే సర్వస్వతంత్రబీజములు నాటఁగలిగిన సత్కుమారుల గనుటకు మార్గదర్శికులు గాన భరత ఖండ భాగ్యరాశులు లోపాముద్రవలె నొక్కని వరించి చక్కని కుమారులగని యెదరుగాతయని కోరుచున్నాము.

లోపాముద్ర చరిత్ర సంపూర్ణము.



## సంధ్యావళి చరిత్రము

మాళవ దేశము నేలుచున్న స్వదేశమహారాజునకు సుగుణవ్రతమగు మంగళవతియను భార్యంగూడి సంధ్యావళియను పుత్రి కంబడసి యామె యోగక్షేమంబులు యరయుచుఁ గాలంబు గడపుచుండెను. ఇట్లుండ యామె శుక్లపక్ష శశాంకుని మాడ్కి దినదిన ప్రవర్ధమానంబగుటయు నామెకు వివాహంబు చేయనియ్యకొని మంత్రులను బిలిచి మంత్రామాత్యవర్యులారా! మనకన్యకకు దగిన వరుండెందున్నవాఁడో వెదక్కనుండన వారలిట్లనిరి.

విదర్భదేశాధీశ్వరుండగు నగరునకు రుక్మాంగదుండను నొక్క పుత్రుండు సుపుత్రుండుగలఁడు; గాన నాతఁ డన్ని విధముల మీ ముద్దియకుఁ దగినవాఁడు. అతనికిచ్చి సంధ్యావళిని వివాహంబు గావించిన బంగారమునకు వాసన యబ్బినట్లుండును. అతనిని దప్పక మీ పట్టికిఁ గూర్చుఁడు,, యనుటయు సంధ్యావళి చిత్తరువు వ్రాయించి విదర్భకనిపి రుక్మాంగద నగరులకుఁ జూపినవారు రతీదేవిచేతి వ్రాఁతయేమోయని యనుకొని శుభలగ్నంబేర్పఱుచుకొని యాశుభ లగ్నంబునకు వీరలచ్చటకు తరలివెళ్ళి యచ్చట వివాహంబు గావించు కొనిరి.

అట్లు వివాహంబు గావించుకొని రుక్మాందుఁడు దండుదళముతో దననిజపురి బ్రవేశించి సామ్రాజ్యమును భుజస్కంధమున నిడుకొని బరిపాలించు చుండెను. సంధ్యావళి పతియొక్క పాదంబులు మనంబున ధ్యానించుచు గాలంబు వెళ్ళబుచ్చుచుండెను.

రుక్మాంగదుఁడు సద్వ్రతగామి యగుట యేకాదశీ మహాత్మ్యము నొక్క సద్వ్రతమునుచేసి యకాలమరణంబులు లేకుండున ట్లు దనరాజధాని యందుఁ జాటఁబాపెను అందరును సన్మార్గగాములై సంచరించుటచే యమలోకంబునకు గొంతపని తగ్గుటయు, యముఁడు విరించినివేఁడి జగన్మోహిని యను నొక్క సుందరాంగిని సృజించి పరిసరారణ్యముల కనిపెను. ఇట్లుండ రుక్మాంగదునకు ధర్మాంగదుఁడను నొక్క సద్గుణములరాశి జనించెను. ఈతఁడిట్లుకాలంబు వెళ్ళదీయుచుండ మృగంబుల బాధ కోర్వలేని పురజనులు కోరుటచే రాజు మృగయావినోదమున కరిగి దుష్టమృగంబుల నుక్కడంచి, దిరిగివచ్చుచున్న సమయమున జగన్మోహిని దీనకట్టెదుటఁ గానంబడుటయు యామెం జేరియిట్లనియె ,,ఓకలికీ! యెవ్వరిదానవీ వెం దుండి యిందువచ్చితివి. వనదేవతవా? లేక కామినివా? వేగజెప్పుము

యనుటయు నా కాంత నీధరాకాంతునిఁ జూచి ,, మహారాజా! నేను వ
నదేవతనుగాను. కామినినిగాను కామించువారికి గామినిగా గాన్పిం
చుచుంటినేమో? నేను విరించిచే సృజింపఁ బడిన జగన్మోహినిని, య
ని వచించి శిరము వంచి యూరకొనుటలో ,, ఆహా! యిటువంటి
తన్వంగిని గూడుటే యుత్తమ పురుషలక్షణమ్మని యూహించి తన్వీ!
నీవు నన్ను వరించుము నీగీచిన గీటుదాటక నీకనుసన్నల మెలంగెద
ను. నీవు నాయంతిపురంబున నుండుము. తులలేని భాగ్యభోగ్యం
బు లనుభవించగలవు. శారదచంద్రికవు కాగలవు. రమ్మి, అని
యామెను బ్రతిమాలుటయు నామెయిట్లు గోరెను అయ్యా నేను గోరి
న దెరంగున జెల్లించెదనని వాగ్దత్తమిచ్చెదరేని వచ్చెద,
ననుటయు, నీవుమెప్పుడు యేదికోరినను దప్పక నెరవేర్చగలను. అ
ని వాగ్దత్తముఁ గావించి పెద్దకాలంబు యామెతో సుద్దులుచేయు
చు రాజ్యంబుమాట భార్యాపుత్రాదుల మాటయుఁ గూడమరచి
స్మరసుఖంబు మరగి కాలంబు వెళ్ళదీయుచుండెను. రాజ్యంబు యీ
తఁడు మరచియుండుటచే రుక్మాంగదుని పుత్రుండగు ధర్మాంగ
దుఁడు పరిపాలన జేయుచుండెను. ఇట్లుండ యేకాదశీ పర్వదినంబు
సమీపించుటయు యెప్పటి యట్లు దండోరా వేయ మనుటయు తల
వరులు యూరుచుట్టును దండోరా వేసిరి. అట్టిసమయంబున మో
హినితో మోహావేశమున నున్న రుక్మాంగదుఁడు దండోరావిని హ
రిహరీ యెంతకామినైతిని రా యని మూలకొదగి యీడిగిల బడి
యున్న రాజుంగాంచి యిదేసమయ మీతని వంచించుట కని యెంచి
దగ్గరజేరి ,, ప్రాణేశ్వరా! నన్నురతులఁ దేలించక యట్లుదూరముగా
బోలగెదవేమి,, యని చేయిబట్టిలాగెను. రాజును తత్తరమంది ,, మో
హినీ! నేఁడేకాదశీ పర్వదినము. నన్నుముట్టబోకుముఁ నేఁడువ్రతంబు
పూర్తిగాఁ జేయవలయును. యనుటయు యామోహిని పూర్వము

నాకొసంగిన వరంబును చెల్లించి మరిగదలును లేకున్నదానికి బదులుగా వేరొండు చెల్లించి మరియు గపలు మనుటయు రుక్మాంగదుఁడు యట్లే యొసంగెదను. నీయిష్టమువచ్చిన వరంబొండు గోరుమనుటయు యామోహిని ,,ఓమహీజానీ! యట్లునీవు బిగ్గగాగిలి పీడదలతువేని నీకుమారుని శిరంబు నాయెట్టయెదుట నీభార్య వగవకుండ, నీవు కండ్ల నీరిడువకుండ, నీఖడ్గముచే నీచేతులార నీవుఖండింపవలయును. అది నేనును మీసమ్ముఖమున నుండి యీక్షింప వలయును. యేమీ యదియట్లు నెరవేర్చెదవా? ఇది యట్లు గానిచ్చెదవా? యిక్ష్వాకువంశ మబద్ధములవుట్ట యనిపించుకొనకుండ నీరెండింట నేదియిష్టమో యదిచేయుము. లేకున్న సత్యదూరుఁడవగుము. అనిపలుకుచున్న మోహినిమాటలు కర్ణకఠోరంబులై చెవులకునాట మూర్ఛవడియున్న దండ్రిని ధర్మాంగదుడు వచ్చి యీక్షించినవాడై ,,దండ్రీ! యేటికిట్లువిచారించెదవు. ఏకాదశీ వ్రతంబుకన్నను నాప్రాణంబులు దీపియా? లెమ్ము. నాశిరచ్ఛేదన మొనరించి తల్లి ముద్దు చెల్లించి నావ్రతంబుపూర్తిగావించుకొనుము. తొల్లినాముత్తాతయగు శిబి దన మేనికండలుసత్యవాక్యప్రతిష్టకొఱకుఁ జండి యివ్వలేదా? సూర్యవంశము సత్యమునకు ధ్వజము. ఆకీర్తి నీవలన కళంకితము గానీకుము. సత్యవాక్యపరిపాలకుండవుగమ్ము. లెమ్ము. అప్పుడు వెంటనే రుక్మాంగదుఁడు లేచినవాడై పుత్రునిసద్బుద్ధికి మెచ్చి, ఖడ్గంబుచేబూని, తనకుమారుని శిరమును దెగవేయనుంకించి దెగవేయగా బుష్పధామమైనెగడుటయు మరలరెండవసారివేయ యాకాశమున యశరీరవాణి యిట్లుపలికెను.

,,ఓరాజా! విడువుము. విడువుము. నీసత్యంబునకు మెచ్చితిమి. సత్యముఁదప్పని నీపుత్రుని సత్యంబుగూడా మెచ్చదగినదియే? గాన మీకొఱకిదిగో రథంబు బంపుచుంటిమి. దానిపై మీరు సతీపతులెక్కి స్వర్గంబును పావనంబు జేయుము. అంతరథంబుపై సతీపతులెక్కి స్వర్గసామ్రాజ్యమును జూరగొనిజేరి.

# చారుమతి చరిత్రము.



ఆదికాలంబున భూలోకంబునఁ బ్రసిద్ధికెక్కి సిరుల కాకరంబై యొప్పు శోణపురంబను నొక పురవరంబు వేదాలితంబై యొప్పు చుండెను. ఆపురంబున వేద విదుఁడని పేరొందిన విప్రుండు మంచి గుణ శీలములు గలిగిన కౌండిన్యుఁడను భూమీసురుఁడుండెను, అట్టి సద్వంశ సంజాతునకు చిత్తశుద్ధియు, భర్తపదసేవానిరతయు, పరమపతివ్రతయు నొక్క చారుమతియను యువతి భార్యగా నెగడుచుండెను. ఆయింతి యుదయమునసేలేచి భర్తచే ననుజ్ఞాతురాలై అత్తమామల పరిచర్య లాచరించి భక్తితో చందన మిడి వంటకములు తయారు చేసి వడ్డించి శేషాన్నమును దాను భుజించుచు గొంత దరిద్రావస్థలో గాలంబు గడపుచుండెను,

ఇటుల మహాపతివ్రతయు సుజనమిత్రయునగు చారుమతి యొక్కనాడు సపర్యలుచేసి కాంతునిశయ్య యధివసించి సురత లాడి నిద్రించువేళ నొక్క మహాతేజస్సు సాక్షాత్కరించి "ఓయువిదా! నీపతి భక్తి నాకుమిక్కిలి యనురక్తి గలిగించె. ఈ భూవలయంబున నీబోటి మందయాన నెందునుగాన. ఓ చారుమతీ! సద్గుణవతీ! యతులకు గాన రానినేను నీకు గానవచ్చితిని. బ్రహ్మాది సన్మునులచేతను బూజింపఁబడు నేను లక్ష్మిని. నీకుఁ గోరినవరంబు లివ్వనామనంబువ్వతిల నేను నిన్నుఁ జూడవచ్చితిని. గావలసిన వరంబులఁ గోరుకొనుము. యిచ్చెద ననుటయు నాచారుమతి యిట్లు జవాబొనంగె.

"ఓయమ్మా! నేను గోరునప్పుడెల్లను నాకు నీసందర్శన భాగ్యముఁ దక్క నాకువేరొండెద్దియు నక్కరలేదు. నాయదృష్టము

ఫలించుట చేతనే నీధర్మన భాగ్యమబ్బినది. అంతియేచాలును. నాకే మియు నక్కరలేదు. యనుటయు చారుమతి పలుకుల కలరి లక్ష్మి యిట్ల నియె ‹‹చారుమతీ! భాద్రపదమాసమున పౌర్ణమితో శుక్రువారమున వుదయముసే లేచి కాల్యకృత్యంబులు నిర్వర్తించుకొని యిల్లు గోమయ ముచే శుద్ధిచేసికొని, ముగ్గులుంచి శుద్ధమగు పీఠమున పిండిచే ముగ్గులిడి, పచ్చని యాకులు గట్టి కలశముంచి అందుపై మామిడి చిగుళ్లను, నేరేడు మారేడు చిగుళ్లను నొక యరటియాకు నందుంచి, తామ్రముతోనైనను, సువర్ణముతోనైనను రజతముచేనైనను, అధమము మట్టితోనైనను, జేయించి ఫలపుష్పవత్రిసముదాయము తో నారకేళంబుతో కుంకుమాక్షతలుంచి, నల్లగాజులు, నల్లపూసలు చే వ్రాకు దువ్వెనలుంచి, దనుసుతతొమ్మిది వంతున ఫలహారములను జేసి యచ్చోనునిచి, భోజన పదార్థములు పిండివంటలు పాయసము, ఫలములు తొమ్మిదివంతున నునిచి నూలుపోగులు తొమ్మిదికి యొ క్కొకదానిని దొమ్మిదేసిముళ్ళు వేసి పసుపుచాయ బట్టించి కలశము న కెదురుగానుంచి కర్పూరధూపదీప నైవేద్యములతో తాంబూలా ది షోడశోపచారంబులుగావించి బ్రాహ్మణోత్తములచే యాశీర్వచ నములంది మిగిలినబంధుమిత్రుల కొసంగి యానాటిరేయి నేలబరుండి యుపవసించిన ధనకనకవస్తువాహనాదులు కలిగి భాగ్యవతివై మిన్నుం ది వెలుగొందుదు" వని నాలక్ష్మి నాకలనుండి తిరోహితయయ్యె.

అంత నాచారుమతి నిద్రిబట్టక యెప్పుడుదయమగునో యనియె దురు చూచుచు తెల్లవారగానే లేచి యత్తమామలకు భక్తినమస్క రించి కలతెరంగంతయుఁ దెలిపి శుక్రవార మెప్పుడాయని నిరీక్షించు చు శుక్రవారము రాగానే పురోహితులరావించి బంధు మిత్రుల బిలు వఁబంచి బందిళ్ళువేయించి, మంగళవాద్యములతో నాలక్ష్మినిఁబూజిం

చి దక్షిణతాంబూలాదులొసంగి, బంధుమిత్రాదులకు యిష్టమృష్టాన్నము లొడ్డించి భుజింపఁజేసి నాథునకు వడ్డించి తానువవసించియుండెను.

అట్లు యతిభయభక్తివినయములతో యాచరించిన వ్రతంబునకు లక్ష్మిసంతసించి యామెయిట్లు నిత్యకల్యాణమును పచ్చతోరణముగానుండు నట్లు వరంబొసంగి చనియె. నాటినుండియే యామెనువరలక్ష్మియనిఁ బేర్కొనుటయును యావ్రతంబాచరించుటయును భారత సాధ్వీమణుల కాచారమైయున్నది.

చారుమతి చరిత్ర సంపూర్ణము.

# దేవహూతి చరిత్రము

కృతయుగంబున త్రిమూర్తులలో నొక్కఁడగు విరించి యనుమతంబున నరులను సృష్టిజేయుటకొరకై కర్దముండను మునిశ్రేష్ఠుడు సరస్వతీనదీతీరంబున బదివేల దివ్యసంవత్సరములు తపంబుసేసె. అంతయట్టి తపఃప్రభావంబున కర్దముండు స్వాయంభువమనువుపుట్టియగు దేవహూతిని వివాహమాడెను. ఆమెపతియే దైవమని భావించి యాతనికి బ్రియంబగునటుల మృదు మధురవాక్యంబుల బలుకుచు యాతనిమాటల కడ్డమాడకఁ కామక్రోధంబులను విడిచి యెల్లప్పుడు పతిసేవశేయుచు అహోరాత్రంబులుగడవుచుండెను. ఇట్లు యహర్ని

శలు యుపచారములు జేయుటచే శుష్కించియున్న సతింగాంచి,,యు వతీ! నీవహర్నిశలు యుపచారంబులు చేయుటచే దేహంబు శుష్కిం చియున్న దానవు కావలసిన వరంబిచ్చెదను గోరుకొనుమని చెప్ప టయు నాయింతిఁ ,,నాథా! యే మహాత్ముని సందర్శనము కొఱకు బ్ర హ్మేంద్రాది సన్ములు సహిత్యము వ్విఖ్యారుదురో, యేపుణ్యపురుషు ని దతోవ్వపదేశంబను దావాగ్నివలన నీషణత్రయంబులను యడవులు దహింపఁ బడుచున్నవో, యెవ్వఁడనంతుఁడో యట్టి పరబ్రహ్మము నా గర్భంబున నుద్భవించు నట్లు వరంబీయ వేఁడుచున్నాను.

అనివేడుటయు, నాకర్దముండు యామెకోర్కెకు మెచ్చి విజ్ఞానాన దంబగు వరంబు గోరితివి. బ్రహ్మదులకైనను నలవిగాని సత్ఫలంబు గోరితివి. యట్లేయుద్భవించును. ఆతనివలన తత్వోపదేశంబునందీ సా యుజ్యపదవిం జేకొనెదవ,, నివరంబిచ్చి జనియె.. అట్లామెవరంబును బొంది యానందమున నుండగా ప్రణవస్వరూపుండును నాదబిందుకళా తీతుండును సుఖదాయకుండును నగు విష్ణువు కపిలుడను నామధే యంబున నుద్భవించె. అట్టిపుత్రుని పరబ్రహ్మంబుగానెంచి యతిభక్తి తో నీక్షించుచు కాలంబు గడపుచుండెను.

,,తండ్రి! నీకుతండ్రియు నాకునాథుండునునగు కర్దమప్రజాపతి చే తత్వలక్షణం బెరింగితిని. జరామరణవర్జితంబునుభవభయనివారణంబు ను కైవల్యసోపానము జేరునట్లు వరంబులొసంగె. అట్టితత్వలక్షణంబు నులక్ష్యణంబుగానెరిగింపుమ" నుటయు ,,తల్లీ! తొల్లిటినుండియు స తికిపతియనువాడె పరమాత్ముఁడు. అట్టిమగని చరణారవిందములను హృ దయమునని ల్పినిర్మలమతులైశాంతిశమదమాదిసద్గుణములంగూడిమహా త్ముఁడగుభర్తచే పతివ్రతా లక్షణములశ్రవణానందముగా వినుచుయట్టి పతికిచేయుయుపచారకర్మమువలన గలుగు నట్టి ఫలమును బొందుచు,

మఱొండెద్దియునుమదినిగోరక, సర్వమును భర్తృప్రీత్యర్థమై. నిష్కామియై యెవతెచరించునో యట్టిస్త్రీమణి మాదృష్టసిద్ధులనుమించి భగవంతునిం దలదన్ని భవిష్యజ్జీవితమునేగాక స్వర్గలోకద్వారమును గూడా దెరువగలదు. ఇకచుట్టములు దొంగలు సుతులు ఋణస్థులు. సతీపతులు సంసారకారణభూతములు, ధనమస్థిరము దేహము రతి చలనములు. జీవము క్షణభంగురము. ఇతరులు కార్యార్థులు. కావున నిహలోకసంబంధమున నొక్కపతినే సేవించుట పరమపతివ్రతాలక్షణలక్షితము" అనిచెప్ప పుత్రుని వాక్యంబులకలరి తననిజేసుని జేరి కాలంబు గడపుచుండె.

కావున ఓతల్లులార! పతిభక్తిచేతనే భగవంతునిగన్నదదేవహూతి. కర్దముని కరుణాతిరేకమేగదా కపిలుని జన్మింపఁజేసినది. మీరుగూడపతిభక్తిగలిగి భగవంతుని ప్రసాదము వడయుదురుగాకయనికోరుచున్నాము

దేవహూతి చరిత్ర సంపూర్ణము.

# చంద్రవదన చరిత్రము.

పూర్వకాలంబున కాశ్మీరదేశము నేలుచుండిన చంద్రశేఖరుఁడను రాజొక్కడు కలఁడు. అతని సుగుణంబులకు యాటపట్టగు చంద్రవదన యను నొక్కకూతురుఁగలదు. అపుత్రిక మిక్కిలిగారాబమున బెరుగుచు చిరుతప్రాయమున నుండియే జ్ఞానంబుగలిగి వర్తించుచుండెను. ఆమెకుఁ గావలసన్నిమణి మయాంతఃపురంబుల వసించుచుండెను.

అట్లుండగా నొకనాఁడు దండ్రివంపున భృగుమహర్షి యక్కన్నియయుండు నంతఃపురమునకు వచ్చి యాబాలికామణిచే నర్ఘ్యపా

ద్యాది విధులం బూజింపఁబడి యుచితాసనంబునఁ గూర్చుండి యా యుపచారములకు మెచ్చి గోరినవరంబిచ్చెద గోరుకొనుమనుటయు నక్కన్నియయిట్లు చెప్పదొడంగె. మునీంద్రా! ధర్మార్థకామ మోక్షములను చతుర్విధపురుషార్థములలో మోక్షమే ప్రధానము గావున నట్టివరంబీయవే, యని వేడెను. ఎట్టివారికి నలవిగాని మోక్ష సామ్రాజ్యమును గోరితివి. దీనికంతయు నాధునిసేవయే పరమావధి. స దాభర్తృచరణారవిందముల నేమరక సేవగొందువేని కైవల్యపదవి ముం గొంగు బంగారమగునని జెప్పిజనియె.

అట్లుండగా నొక్కనాడు జంద్రశేఖరుండా పుత్రియంతఃపురం బునకుఁ బోయి నానోముఁలపంటా! నాతల్లీ! నీవు ప్రాయంబువచ్చె. నొక్క రాజకుమారునివరించి సుఖంబుండుము. అట్టివాడెవ్వ డో దెల్పిన దెచ్చెద, ననుటయు "నత్తరి, విద్యావిహీనం పశుభిః, యను నార్యోక్తి ననుసరించి విద్యలేనివరుడుఁ నవమన్నదుండై నను పశు తుల్యుడు. కావున నేనుగొన్నిప్రశ్నలు వ్రాసెదను. వాటికుత్తరమీయ గలవానిని పతిగా బడసెద నని యిట్లు బ్రశ్నలువ్రాసెను.

1. స్త్రీలకు భూషణంబేది ?
2. స్త్రీలుదేనివలన పుణ్యపదవికిం బోదురు ?
3. లింగదేహమేది ?
4. మానవులెట్టి కర్మమువలన విముక్తిబొందుదురు ?
5. జీవాత్మకు పరమాత్మకుఁగల తారతమ్యంబేది ?

యనియైదు బ్రశ్నలకుత్తరమిచ్చువానిని నాకుద్వాహముఁ గావింపుము. అని చెప్పి యాప్రశ్నలు దండ్రిచేతికిచ్చిపంపె. ఆప్రశ్నలు రాజకుమా రులందరు దిలకించి చేయునదిలేకమిన్నకుండిరి. విదర్భాఖ్యుడను నొక్క మహారాజు మాత్రము నాయైదు ప్రశ్నల కిట్లుత్తరంబు వ్రాసె.

1. మానసము.
2. పతిభక్తిచే.
3. భగవంతుని ప్రకృతిరూపము.
4. లాభమాశించకజేయు పుణ్యకర్మలవలన.
5. జీవాత్మ తామరాకువంటిది పరమాత్మ యాతామరాకు నంటక నుండుట వంటిది.

యని యైదు ప్రశ్నంబుల కుత్తరమువ్రాసిన వింధ్యాఖ్యునకు చంద్రవదన నిచ్చి వివాహంబొనరించె. ఆతనికి మొదటిభార్య చిత్రాంగద. అట్టితరి కొన్నిదినంబులచ్చట జరిపి యత్తమామలకు నమస్కరించి నిజ దేశంబునకుఁ భార్యాసమేతుఁడై బయనమయ్యె. మొదటిభార్య పుట్టింటికేగి యామెనుగూడా దీసికొని బయలుదేరి కొంతదవ్వేగి య చ్చట నొకయరణ్య ప్రదేశంబున విశ్రమించిరి.

ఆరాత్రి దేవవేశ్యలు విహారార్థమే తెంచి యామార్గమునఁబోవు చు చంద్రవదనంగాంచి మనకన్న మిన్నయగు సుకుమారులున్నారన్న మాట మనమీరాజకుమారుని మనదేశంబునకు గొనిపోదుమేని యీమె విరహానలం బున గొంత సౌందర్యంబు దగ్గవచ్చునని యూహించి విం ధ్యాఖ్య దమనెలవున కెత్తుకపోయిరి. పిమ్మట చంద్రవదనయు చిత్రాం గదయు మేలుకొనినాధుండు గానరాక దిశలుపరికించి యెంతదడవునకును గానరాకుండుటకుఁగుంది చిత్రాంగదయిట్లు చెప్పెను. ,,చెల్లెలా! చం ద్రవదనా నాధునియొరులెరోతస్కరించిరి. మనముజాగుసేయక దండ్రు లపాలికరిగి జరిగినవృత్తాంతంబు నివేదింపవలెను రమ్ము రమ్మనుటయు నాచంద్రవదన యిట్లు జవాబొసంగె.

,,అక్కా! చిత్రాంగదా! మననాధు డిటలేనితరి మనమెట్టి స్వాతంత్ర్యమును బూనరాదు. నీవుగావలసియున్న పుట్టింటికేగుము ఆత

ము యిప్పుడు స్వర్గలోకంబుననున్నట్లు గానవచ్చుచున్నది. నేనునహూధి ష్టింబూనెదను అనిచెప్పి ముప్పది యెనిమిదిదినములు పంచేంద్రియ వ్యాపారమణచి పతినిమదిని సమాధినిష్టనుండునంత స్వర్గలోకంబుననీమె పతివ్రతాగ్నిబ్రజ్వరిల్లి దేవలోకంబంతయు దగ్ధంబొనరించుచుండె. ఇ య్యగ్నిజ్వాలలకోర్వక దేవతలు మొఱబెట్టగా యిందుృ్రండు నేఁడుమన స్వర్గంబునకే మోసమువచ్చెను. ఈశ్వరా! యనిదివ్యదృష్టి నీక్షించిచం ద్రవదన పతివ్రతాగ్నియని యెఱంగి రంభోర్వశీ మేనకా తిలోత్తముల జివాట్లుబెట్టి యామెనాథుని యామెకొప్పగించి యొకంబరచి భూలోక మునకు బంపెను. వారాయరణ్యమునకువచ్చి వింధాఖ్యుని జంద్రవదన కప్పగించి యామెచేదీవెనలంది నిజనివాసంబులకుంజనిరి.

వీరు పతీసతులు యయ్యాంధ్రదేశమునకు దనరాజ్యంబుబట్టాభి షేకంబుజేసికొని యష్టైశ్వర్యములతో దులదూగుచుండెను

ఓ యువతులారా! స్వర్గమర్త్య పాతాళంబులుగూడా భవదధీనం లు. పతిభక్తినిమించినభక్తి సతికిలేదు. పతిభక్తియే సతికిమోక్షసామ్రా జ్యము. గాన పతిభక్తి కలిగి యుండుడు.

చంద్రవదన చరిత్ర సంపూర్ణము.

## సురభి చరిత్రము.

త్రొల్లి కొలదిదినముల క్రిందట కనకపురియను పేరుగలయొకపత్తనం బొప్పుచుండెను. అందొకసద్బ్రాహ్మణుండుండెను. ఆతనికి సద్గుణభూ షితాంగియు సద్గుణములపాత్రియునగు నొక్కకుమార్తె సురభియను నామంబున నొప్పుచుండెను. ఆబాల యొక్కనాఁడు దండ్రినిఁజూచి

"నాయనా ! లోకంబునంగల స్త్రీలుయేవిధంబున పుణ్యలోకంబుజూర్వ గొనగలరు నాకెరింగింపు" మనుటయు నా రాజేంద్రుడిట్లుచెప్పె.

"తనయా ! సుగుణములకునిలయా ! లోకంబునఁగల సద్ధర్మము లలోనెల్ల భర్తపదసేవన మోక్షసామ్రాజ్యానందనందాయకము. అ టువంటిపతిరాజంబుచేతనే సతులకుఁబుణ్యలోకంబుగలుగును.అమ్మా! పతివ్రతా ధర్మమనుష్టించుటకష్టము. స్త్రీలకుభర్తయేదైవము గనుక పతిని నియతిని పరబ్రహ్మస్వరూపంబుగా.పూజించుచు సర్వకాలసర్వా వస్థలయందును దలచుచుందురేని భూమ్యాకాశంబులు త్రిమూర్తులు నీకువశులైయుందురు" అని నుడువుటయు యంతలో సురభి యానదుప దేశంబువడసి సన్మార్గామియై యుండెను.

అట్లుండగా నొక్కనాఁడా విప్రుని యింటిమార్గమున యగ్ని దత్తుడను నొక్క సద్బ్రాహ్మణవటుఁడువచ్చి "స్వామీ! ఆకలిగొని డస్సితిని. నాకింత యన్నము వడ్డించుడ"నుటయు వానికన్నము వడ్డించి వాని పూర్వోక్తోదండము లడిగెను. ఆతఁడును యాతనియూరు పేరుల తోసహాచెప్పఁగావిని వీడు బ్రహ్మచారి శాస్త్రవేత్త సత్కార్యానుష్టా నపరుడు, ఆచారవంతుడు. గాన వీనికి మనబిడ్డనిచ్చివివాహముఁజేయుట మిగుల శ్రేయస్కరమని యెంచి యాతనికి దనవృత్తాంతమును చెప్పిదన కు దనబిడ్డనిచ్చెదనన వాడిట్లనియె.

"స్వామీ ! మీరిచ్చెదనన్న నేనువద్దనగూడదు. సదాచారపరు రాలును సత్యవ్రత నిరతయునగు యువతిని బెండ్లాడుట భావ్యమేకయా మెయట్లుగాని లోకంబంతయు నరకంబే గాననేను మూడుప్రశ్న లడిగె దను. అమూఁడు ప్రశ్నంబులకును మీబాల బ్రత్యుత్తరం బీయగలిగి న చేకొందు ననుటయు కుమార్తెనుబిలిపించగా యిట్లు బ్రశ్నించె.

# సురభి చరిత్రము.

అట్లువచ్చిన యాసురభినిం గాంచి శోభనరేఖం దిలకించి యా రేని యీమె మనకు దగినదియే? యనిసంతుష్టాంతరంగుడై యిట్లుమూడు ప్రశ్నలు వేసె.

1. స్త్రీలకు నీచమగునదేది ?

2. శ్రేష్టమగునదేది ?

3. భూషణమేది ?

సుగుణభూషణీ ! యని యడుగ నామెయిట్లు ప్రత్యుత్తరం బొసంగె.

1. స్త్రీలకు తుచ్ఛమును, మోదమావులవంటిదియును నగు యిహలోకమున గలుగు భోగమేనీచము.

2. జ్ఞానంబుచే యానందించుటయే శ్రేష్టంబు

3. పాతివ్రత్యమే భూషణము.

అని పల్కిన పలుకులకలరి మన సుకృతముచే లభించిన సురభి యని యెంచియామెను యుద్వాహమాడెను. అత్తవారింటనే యారు మాసంబులనుండియుండుచు గాలంబు గడవుచుండగా సురభి యతివిన యంబున సపర్యలుచేయుచు పతిని పరబ్రహ్మస్వరూపమని యెంచుచు గాలంబు గడవుచుండె.

అట్లుండగాసముద్రుని కూతురైన సరసయను కన్యకామణి పురుషసాంగత్యాభిలాషియై చెలికత్తెలనుబిలిచి షట్కాంత్ర పారంగతుం డగు నీ బాలుని గొనిరమ్మనుటయు యంతవారు సముద్రము నాలుగు దిక్కులయందు యీబాలునికై కాచియుండుటయు నొకనాడగ్నిదత్తుం డు చంద్రగ్రహణంబున స్నానంబుచేయ భార్యాసమేతుండై సముద్రంబున కు జని భార్యయు దానును గొంగుముళ్లు వేసుకొని సముద్రంబున మునిగెను. మునుగగానే యొక మొసలి వేగిరంబున వచ్చి యగ్నిదత్తు నెత్తుకపోయెను. అట్లెత్తుపోయి యా మొసలి సరస యెదుటం బెట్టిన యా మెంగాంధర్వవిధిని యాతనిం గూడుచుండెను.

ఇచ్చటసురభి తనతోఁగూడ మునిగిన భర్తనుంగానక యేడ్చుచుండెను. మొసలియో. మత్స్యమో నానాథుని మ్రింగియుండును. గాన, నేనిందుండి రానని భీష్మించి తనతోవచ్చినవారలకుఁ జెప్పినవారలుకొంత సేపు దుఃఖించి నిజనివాసములకుఁజని తండ్రికీవృత్తాంతి మెఱిగించిరి. అచ్చటయామె పద్మాసనాసీనయై పతిపదారవిందంబులు చిత్తంబుననిడి తేతాగ్నులొక్కటింజేసి వానితో దనపతివ్రతాగ్ని ప్రజ్వలింపఁజేసిన నట్టి యగ్నిసముద్రజలంబులింకింపజేసి సముద్రంబునఁగల జలచరంబులకు యుపద్రవంబు కలుగజేసెను. ఇట్లుండ యాదేశపురాజు యాసంగతివిని యాశ్చర్యపడి యామెకు యెండ తగులకుండ నట్లు పందిళ్ళు వేయించి కొందఱభటుల యచ్చట రక్షణార్థముంచి యెప్పటిసమాచారమప్పుడు తెలుసుకొనుచుండెను. ఇట్లుండ యాదేవి పతివ్రతాగ్ని పెల్లుబ్బి సముద్రునితబ్బిబ్బు జేయుచుండెను. అప్పుడాసముద్రుండా వేడికోర్వలేక చారులవలనజరిగిన వృత్తాంతంబెఱింగి కూతునుముందలించి యాతనివిడువుమనుటయు నాప్రాణమైనయిత్తునుగాని యాతనివిడువననుటయు, నన్నుగూడదోడ్కొనిచని యాసురభి కప్పగించుమనుటయు సరసనుయగ్నిదత్తుని చేకొని సముద్రపుటొడ్డునకు వచ్చి దపంబుసేయుచున్న సురభికినమస్కరించి సరసను నీచెల్లెలుగాజూచుకొమ్మని యప్పగించి యనేకదివ్యరత్నంబులిచ్చిజనియె అంతియవ్వార్త యాపట్టణంబేలురాజు డెలిసికొని సరసను సురభిని యగ్నిదత్తుని పట్టపుటేనుఁగుపై నెక్కించి పూరంతయు నూరేగించి యిష్టోపభోగంబులనుభవించుచు నారాజువద్దనేయుండెను, ఇట్లుండుచు కొంతకాలంబేగినతరి నాదంపతులు విష్ణుసాయుజ్యంబును బొందిరి.

సురభిచరిత్రము సంపూర్ణము.

# అమృతవల్లి చరిత్ర



సీమంతునీరత్నంబులగు యింతులకు మేలు బంతి యమృతవల్లి యనుయింతి నేపాళదేశపరిపాలితుండగు విహ్వలుఁడను నొక్క భూజాని కిభార్యయై యొప్పుచుండెను. ఆయమృతవల్లి శుభలక్షణ లక్షితయై సదా భర్తనే స్మరించుచు మంచి నడవడి గలిగి నాథుని సపర్యలయందు మెలగుచుండెను. ఇట్లుండనప్పట్టణంబున నొక్క బ్రాహ్మణుండు యవసాన కాలంబు సమీపించుతరి యాతని పుత్రుండు యాతనింజేరి,, నాయనా! నావివాహాది కార్యంబులకుగాని, నా నిత్యకృత్యంబులకుగాని, యేమియుధనంబు స్వీకరింపక నన్నునాదరణంబు సేసి యేగన్యాయమా? యని పేలుంగున బొబ్బపెట్టుటయు నాయతిసహానుండగు సద్బ్రాహ్మణుండు బుత్రునిఁ జేరి ,,వత్సా! తల్లులు చచ్చుచు బిడ్డలకు మేతలిడునా? అయినను నేనొక చీటీయుత్తరము వ్రాసి యిచ్చెదను. ఆయుత్తరము నీ కవసరమగునప్పుడు యీపట్టణంబేలు రాజునకుఁ జూపింపుము. ఆతఁడు దగిన బహుమాన మియ్యగలఁడు" యని చెప్పిప్రాణంబుల విడిచెను.

అంతనాపుత్రుఁడు దహనాది కృత్యంబుల నెరవేర్చి వుత్తరక్రియ లనొనర్చి, యొక పక్షంబు గడచిన తరి యాచీటీచేత ధరించి క్ష్మాపతి సన్నిధి కరిగి యాచీటీ రాజుముంగలఁ బెట్టి నిలుచున్నతరి యారాజు చీటిందీసి దానినిట్లు చదివెను.

,,శాంతమే భూషణము. దురితమే మరణము" అను ప్రశ్నంజదివి దానిని దన జంద్రహాసము నుంచుకవచములో నుంచి యా బాలకునికి తలయునంత ధనమిచ్చి పంపెను.

అంతనమ్మహారాజు గొన్నిదినంబులు గడచినతరియడవికివేటాడునైకేరాజుచనియెను. ఆసమయంబును గనిపెట్టి వారికినిత్యము బ్రక్కలు వేయుదాశలి పాన్పునవరించి బజారునకేగిజాజిప్రసూనములు గొనితెచ్చిదానిపైజల్లి వానికెప్పటినుండియో యున్న తమకంబు నిండారయాశయ్యాపైఁబవ్వళించిపొరలుచు దనశరీరంబుగానకయందుగలపీతాంబరంబునుగప్పికొని గొప్పయగుయానందముచే తెప్పరిల్లక ముప్పిరిగొన్న మూర్ఖత్వముచే యట్లెనిదురపోయెను.

అట్టితరి యెన్నఁడును వచ్చురీతి యన్నుల మిన్నయగు యమ్మృతవల్లి సర్వభూషణాలంకార శోభితయై దనశయ్యాగృహంబు బ్రవేశించి యాశయ్యపై దనమగడేమైమరచి వేటబడలికె నిద్రించుచున్నాడని యూహించి యామహారాజును లేపగూడదని మదినెంచి వానునుయాప్రక్కనేబరుండి నిద్రించెను. అట్టితరి మృగయావినోదార్థ మేగినరాజువేటచాలించి యెప్పటియట్లు పురంబునకేగుదెంచి యంతఃపురంబుబ్రవేశించి శయ్యాగృహంబునకేగెను. అట్లుపోయి శయనించి యున్నసేవకుని, భార్యనుజూచికోపోద్దీపితుండై కండ్లనిస్ఫులింగబుల రాల్చుచు వీరిద్దరనొక్కవ్రేటున దెగవేయనుంకించిన యందుండి „శాంతమే భూషణము. దురితమేమరణము" యనుముక్క ముందలంబడియె. దానింజూచి నారాజు యమ్మునియిట్లు వ్రాయుటకు గతంబుండునని యూహించి యెత్తినఖడ్గంబును యొరలోనిడ మంత్రింజేరి „ఓమంత్రీ! గంటివే. తుచ్ఛమగు భోగంబున కాశించి మత్ప్రాణనాయకి యెంతపని జేయఁబూనినదో యావిచిత్రంబును గనుము"నియాతని ముంగలకుఁద్రోసి దానువెనుకకుఁజనె. అంతమంత్రి „మహాప్రభో! దీనినిజవృత్తాంతంబారసెదను. మీరు వెనుకకుదగ్గి వీక్షింపుడు" అని మంత్రి ముందునకుంజని చేతులుతప్పటలు గొట్ట సాగెను. ఆతప్పటలు విన్న యమ్మృతవల్లి లేచి మంత్రినీక్షించి „మంత్రీ! యంతఃపురంబునకు రాదగునా? ఈకార్యంబు

చితమా? భార్యాభర్తలుండు శయ్యాగృహంబు బ్రవేశించుటకు నీకు హక్కు గలదా? యిదిచిక్కు యని నీవెఱుంగవా? మక్కువగా పతితో నున్న పతివ్రతల నుపలక్షించి బ్రమకఁ జూచెదవా? పురీశుఁడు విన్న ముప్పువాటిల్లకుండునా?" యని తెప్పున ముప్పిరి గొన్న కోపంబుతో జనుచుండెను. అప్పుడా మంత్రి యామహాసాధ్వీమణిని వెంబడించి "తల్లీ! సుగుణములకల్పవల్లీ! మీరేల నన్నింతగా గోపించెదరు. నేను మీకుపుత్రుండనుగాని యన్యుండనుగాను. తమపుత్రునిఁ గరుణించు డమ్మా యని వేఁడుకొనుటయు నాపతివ్రత "మీరెంతవని యున్నను తాదగునా? దాసదాసీ జనంబులుండ దామేల యిచ్చటకు రావలెను. అదియేనామతంబుగాని వేరొండుగాదు." అనెను. అప్పుడు మంత్రి "అమ్మా! రాజుగారు వేటాడనరిగి యెప్పుడు వచ్చియిందు బన్నుండిరి. ఆవివరంబు సాకల్యంబుగ జెప్పుము." అని యడిగిన మంత్రింగాంచి "ఓ మంత్రీ! నాప్రభుండు నొకటిజామునకే యిందు వచ్చి పరుండెను." అని జెప్పిన విని మంత్రి "తల్లీ రాజుగారిరాకను తమరు చిత్తగించిరా? ఏదారిని వచ్చి బరుండిరో చూచితిరా?" యని మంత్రి బ్రశ్నించుటయు నాయమ "వారెట్లు వచ్చిరో నేనెఱుంగ. వారలు వేట తమకంబున యలసియుండురని దలంచి వారల లేపి యీప్రశ్నలు యడుగలేదు." అని దన గదిలోనికి జనె.

అంత నమ్మంత్రియు యీబిడ్డ వ్రతవిహీనగాడని యెంచి సేవకుని బ్రమోలకుఁజని యాతని లేపిన నాతండును త్రుళ్లిపడి మంత్రింగాంచి కలగుండువడి, కాళ్లు చేతులు వణక, నోటమాటరాక, వెఱ్ఱిమొగము తో మంత్రి వంక తదేకదృష్టితోఁ జూచుచుండెను. అట్లే నిలిచియున్న సేవకుని నిఁజూచి "ఓరీ! దురాత్మా! యెంతపని జేసితివి. నీ ప్రక్కన బరుండిన వారెవరు నిజముగ బల్కుమని నుడువుటయు నాతండును

భయభ్రాంతుఁడై ;; ఓమహాత్మా! ఈ సమయంబున నన్ను రక్షింపుము. నేను యనేక దినంబులనుండి యీవిరిశయ్యపై బవళింపవలెననుకోర్క గలిగి రాజుగారులేనితరిజూచి బరుంటిని అంతియేగాని నాప్రక్కను యింకొకరెవరును బరుండలేదు. ఇదినిజము ముమ్మాటికినిజము. అనిబల్కినవచనంబులకలరి వానిని పారాజవానులకప్పగించి రాజుంగాంచి అయ్యా! చూచితిరా! యీదివ్యోదంతము ఇంక సందేహమిసుమంతయునుండ నవసరములేదు. అనిచెప్పినను రాజుమంత్రిమాటలు నరకుగొనక తనపత్నియగు యమృతవల్లిని రప్పించి ;; ఓచెడిపా! దాసీవాని చెంతబన్నుఁడిన నేరంబునకై కళపళ క్రాగునూనెలో నీవుస్నానమాడి చెక్కు చెదరని శరీరంబుతో వచ్చితివేని నన్నుగూడిసుఖంబున నుండవచ్చును. లేకున్న పుట్టింటంజను మనియుత్తరువొసఁగె ఆయుత్తరవును శిరసావహించి. గంగాళంబునూనె పోయించిసలసల క్రాగుచున్ననూనెలో మజ్జనమాడ బ్రయత్నించుచున్నపత్నింగాంచి యమృతవల్లీ! నీవును దాస్యుడును నిద్రించుచున్నతరి మిమ్మిద్దరనొక్కవేత్రమున వ్రేయనుంకించినతరి యీచీటి యశరీరి యొక్కతెగాయెదుటబడవైచె. నీవుపతివ్రతవగుదువేని యీచీటిగూడా యిందువైచుచున్నాను. ఇదిగూడానిప్పటియట్లు నుండవలెను అనియాచీటీనిగూడ యందువైచెను. దానితోపాటు యామెగూడా యాగంగాళంబునకురికి స్నానమాడి ఆచీటీనహిత మీవలకువచ్చెను ఆచీటీ పూర్వము చావుకుసిద్ధమై కుమారునియాస్తిగానిచ్చి రాజునకిమ్మని చెప్పిన శాంతమేభూషణము. దురితమేమరణము అనువాక్యముగలది. ఈచీటియే యాచంద్రహాసముతో బడకున్న సంఘమరణములు దప్పవుకదా! అట్టిచీటీని దేవుని మాదిరిబెట్టి బూజించుచు నాదంపతులు సుఖంబుగ గాలంబు గడపుచుండిరి.

అమృతవల్లి చరిత్ర సంపూర్ణము.

# సుమతి చరిత్ర.



అఖిలశుభంబుల కాస్పదంబగు అదిష్టానపురమున కౌశికుండను నొక్క బ్రహ్మణుఁడుగలఁడు అతఁడు బాల్యప్రాయంబుననే త్రిలోక సుందరియు సుగుణంబుల కాటపట్టగు నొక యువతీలలామంబును సుమతి యను దాని నుద్వాహమాడెను.

ఈతని చేష్టలు సర్వజన దుర్జ్ఞేయములై జూచువారికి వినువారికిఁగూడా నసహ్యంబులగు పనులఁ జేయుచు గాలంబు గడపుచుండెను. ఈతఁడట్లు విటకత్తెల యిండ్లకేగు నప్పుడు భార్యను బిలిచి యచ్చటకుఁ గారెలు బూరెలు చాలినన్ని దీసుకొనిరమ్మని చెప్పి యామెను యమురుపెట్టుచు గాలంబు గడపుచుండెను.

అట్లున్నను సుమతి గొంచమైనను మగని గోపింపక దాను జేయఁగలిగినన్ని సపర్యలు జేయుచుఁగాలంబు గడపుచుండెను. ఇన్ని గొన్ని దినంబులు కడచుసరికి యున్నదంతయు యూరులంజెల కిడుట చేత దినుట కన్నమును కట్టగుడ్డలేక కటకట బడుచుండెను. ఇట్లుండ యామె భర్తకేది వచ్చినను దనదిగా భావించుచు మాంగళ్యము సహితమమ్మడు వోయి పెంచుమన్నను సుఖవ్యాధులు జీర్ణించుటచే మొద్దబ్బాయి పోలిక తయారై మాటలు తడబడ మర్యాద విడిచినవాఁడు గావున ఆయూరగల పద్మావతియను నొక్కవెల యాలినిదనకుఁగూర్పుమని సతికెరింగించుటయు పతివ్రతయగు నాసతి యట్ల కాకయని తెల్లవారకమున్నె లేచి పద్మావతి గుమ్మముదుడిచి కళ్లావు జల్లి భద్రంబుల బెట్టి నిత్యమును యేగుచుండెను. అట్లు ప్రతిదినము దాను లేచు సరియెవరో ముగ్గులిడుటఁ జూచి యక్కజంబంది

యామెను బట్టుకొన వలెనను యుద్దేశంబు మదిలో గలిగి యొక్కనాడు రేపకడ లేచి నిరీక్షించు చున్నంత నీసుమతి యథాప్రకార మచ్చటికేతెంచి సర్వంబును జేయుచున్న నాయువతిం గాంచి ,,ఏమమ్మా! నీయుద్దేశంబునం గలకోర్కె యెద్దియో జెప్పిన నేను నెరవేర్చెదను. అదేదియో యానతీయవేడెదను. అనుటయు నా థునకు యామెపైగల మోహ మెఱింగించి యొప్పించి నాథునకివ్వార్త నెఱింగించెను నాథుండు యపరిమితానంద సంభరితుండై యాతం డు గంపలో గూర్చుండ గంప యెత్తుకొనిపోయి యావేశ్యసన్నిధిని విడిచిన యామెయు యాతఁడు సుఖరోగంబు జీర్ణించుటచే గలిగి న కుష్ఠురోగియని మదిరోయక. యతులితములగు రతులం దేలించి ది ల్లవారుగట్ల సుమతిని లేపి యాగంప నందియ్యగా యాగంప నెత్తి నందుకొని నొక్కమార్గంబున బోవుచున్నతరి దారితప్పి మఱియొ క మార్గంబునం జనుచు మాండవ్యమహామునికి నగలు దొంగిలించె ననునేరంబు మోపి కొఱ్ఱ వేయంబడిన యాతనిం దాకిన నాతని కి యెనలేని యవస్థగలుగుటయు యామునీశ్వరుం డమ్మహాసాధ్విం జూచి ఓహో! సంభ్రమవిహ్వలివైనాకింత కష్టంబు గలిగించితివి; గాన రేపు సూర్యుండుదయించునరికి నీభర్త శిరంబు సహస్రవక్క లగుగాక! యనిశపించె. దేవా! తెలిసి నీకపచారంబుననేను సలిపి దాననుగాను. తెలియక జరిగిన యపచారంబునకు శపించితివిగాన నేనే పతివ్రతనగుదునేని పతిభక్తినన్నెడబాయకుండ నున్న సూర్యుం డే వుదయించకుండుగాక? యని ప్రతిశాపమిచ్చెను. అట్లుప్రతిశాప మిచ్చి ప్రాణేశ్వరునకు ధైర్యంబుగరపి ,, నాథా? నాశాప్యమే వృథాగా యగునేని మిన్నువిరిగి మీఁదబడుగాక! చుక్కలు బొ ట బొట రాలును. భూమికృంగిపోవును. సూర్యచంద్రులు గతులుడ వ్వుదురు. ఏటికీ విచారము. దివాకరుఁడుద్భవించునని యా?” అని

భర్త యనేక విధంబుల ధైర్యంబుగరపి సుఖంబున నుండెను. ఎంతసేపటికిని సూర్యోదయ మగుగాదే? ఇదేటిమాయయని ముమ్మూర్తులును, దేవతలు, మహర్షులు మొదలగు ప్రాణులందరు యుల్లకల్లోలమై యీపరమ సాధ్వి సన్నిధికేగుదెంచిరి. అట్లువచ్చి తల్లీ! నీపాతివ్రత్య ప్రభావమద్వితీయము సూర్యుడులేకున్న హవిర్భాగములు చెల్లవు, సస్యంబులు నశించు. జీవులు కృశించు. ఇక కరుణించి భగవానుని రాననుజ్ఞ నొసంగుమనుటయు నామెముమ్మూర్తులతో నిట్లనియె ‹‹అహా! నాపాతివ్రత్యముచే మిమ్ముఁజూడఁగంటి మీదర్శన భాగ్యమబ్బె మీకరుణయున్న నాపతిబ్రతుకునట్లు వరంబు దయచేసితిరేని సూర్యోదయం బగునట్లు నేను జేసెదను.” అని నుడువుటయును వారునుసమ్మతించిరి. అప్పుడు యామె పతిపాదంబులు ధ్యానించి, ‹‹సూర్యోదయమగుగాక” యనినుడివె. అంతట సూర్యుండుదయించుటయు నాయమభర్తయగు కౌశికుని శిరంబు వేయివ్రక్కలగుటయు నవియన్నియు యేరి త్రిమూర్తులు కౌశికుని యాకారంబు నిర్మించి యాతనికి దీర్ఘాయువును సుకుమారత్వంబును గలుగునట్లు వరంబిచ్చి యదృశ్యంజనిరి.

తదనంతరంబు నాయూరి ప్రజలెల్లరును నీమె పతిభక్తికిని, నిత్యసేవానిరతికిని, సత్యసంధత్వమునకును యనేక జోహారులొనరించి, యిటువంటి పతివ్రతలు గొందరుండుట బట్టియే లోకంబు నిలుచుట గలిగినది. ‹‹ కోటికొక్కసాధ్వియు నూటికొక్కపురుషుండను'' సామెత నీమెయుండ సార్థమైనదని వేనోళ్లబొగడుచు నిజనివాసములకుఁ జనిరి.

ఇట్లు గొన్నిదినములు భర్తతోడ సర్వసుఖంబులనుభవించి తదనంతరంబు విష్ణుసాయుజ్యంబును జూరగొనిరి.

సుమతి చరిత్ర సంపూర్ణము.

---

# ప్రభావతి చరిత్రము

సకల శుభంబుల కాకరంబగు పాటలీపురంబను నొకపురవరంబు గలదు. ఆపురంబును ధర్మమార్గైక నిరతుండును, సత్యసంధుండును, సకలాచార సంపన్నుండును, సద్గుణగణ విరాజితుండునునగు చంద్రశేఖరుండను సూర్యవంశపురాజు బరిపాలించుచుండెను. ఆతనికి లేఁజిగురుటాకులదలదన్ను నొక్క పుత్రికారత్నంబు ప్రభావతియను బాలామణి యొప్పుచుండెను. జగజ్జేగీయమానముగా నేలుచుండిన నీ మహారాజు యీ పుత్రికా సంతతికే రాజ్యంబీయ సంకల్పించుకొని యుండెను.

ఇట్లుగొన్నిదినంబులు గడవగా యాప్రభావతికి నవయౌవన మావిర్భావమగుటయు, కూతుంజేరి తల్లీ! నీకు యౌవనమంకురించినది సాటి రాజలోకంబులో నొక్కమేటిని వరించి కీర్తినిగనుము ఎవ్వని యందు నీ మనంబున్నదో యెరింగించెదవేని వానిని గొనివచ్చి నీకు ద్వివాహంబుగావించెద ననుటయు ,, తండ్రీ! లోకములో సతికి దగిన పతియును. పతికి, దగిన సతియును దొరకుట దుర్లభంబుగాన నేను వివాహంబొల్ల" నని చెప్పెను. తండ్రియు మదిలో నెంతయు చింతించి ,,అయ్యో! నాకు బిడ్డలులేక యీ యొక్కకుమార్తెయుగలుగుటయును, ఈమె వివాహంబాడ నని భీష్మించుచున్నదే!" యని మనంబున యూహించుచు గాలంబు గడపుచుండెను.

అట్లుండగానొక్కనాడు నారదుండేతెంచి రాజువలన ప్రభావతీ వృత్తాంతము సాకల్యంబుగా విన్నవాఁడై యాప్రభావతిని యెట్లయినను యొప్పించెదనని యామె కడకరిగెను. అట్లు ప్రభావతి యొద్దకుఁజేరి యామెకిట్లు చెప్పందొడంగె. ,, ప్రభావతీ! చతురాశ్రమంబులలో గృ

హస్థాశ్రమంబు యుత్తమంబు. అట్టి యాశ్రమంబున నుండియే పతిభక్తి నెరవుచు సకల సంపత్తులు బొందవచ్చును. గాన దానిని విడచిన యు విదకెందును ముక్తి లేదు.'' అని జెప్పుటయు నామెయు యంగీకారసూచకమభిన యించుటయు దండ్రికివార్త నెరింగించుటయు యాతండును వచ్చి దనయకిట్లనియె. ‹‹ తల్లీ! నీకు యెవ్విధంబగువరుఁడు కావలెనో గోరుకొనుము.'' అని నుడువుటయు ‹‹ తండ్రీ! వేదశాస్త్రపురాణేతిహాస ధర్మములను, మహాతత్వ విచారుంఉను, మిక్కిలి వివేకవరుండును నగుచు దేశాటనాపరుండగు వానిని బెండ్లి యాడెదను. అని నుడివిన యాతడు యట్టివానికై విచారించుచుండెను.

అట్లుండగా మగధదేశ రాజపుత్రుండగు చిత్రకరుండను వాఁడు దేశాటనముఁ జేయుచు నీపాటలీపురమునుజేరెను. అట్లు జేరిన యారాజపుత్రుని వృత్తాంతంబు చారులవలన రాజువిన్నవాడై యాతని నిజవృత్తాంతమును దనయ కెరింగించి యాతని భర్తగా సమ్మతింపుమని కోరుటయు నామెయట్లుకాకయని యొడంబడి యాతని యుద్వాహంబాడెను. పెండ్లియైన దినము మొదలు ప్రభావతి పతిని పరబ్రహ్మముగా నెంచుచు సేవజేయుచుండెను. ఇట్లుండయుల్లుఁడు యారుమాసములుండి యత్తమామల యొద్దసెలవుపుచ్చుకొని దననగరంబునకుఁ బ్రభావతీ సతీసమేతుఁడై బయలుదేరెను. ఇట్లుబయలుదేరి నీమె పతివ్రతాత్వముఁ బరీక్షింపనెంచి నొక్కయడవిని విడిసి యందుబరుండి నిద్రించుసమయమున ‹‹ప్రభావతీ! యని యామెపలుకలేదను నెపంబున దిగవిడిచి యర్ధరాత్రంబున లేచిపోయెను. ప్రభావతి చిత్రకరుడు లేచిపోయినయొక్క ముహూర్తకాలంబులోలేచి చూచినరికి నాంధుడట్లోపలాయన సూత్రి మవలంభించి నాఁడని యెంచి మదిలో ధైర్యమవలంబించి యీమహాత్ముండు మగధదేశంబునకే బోయియుండునోయునని యెంచి యమ్మగధదేశం

బునకుఁ బయలుదేరెను. అట్లుబయలుదేరిన నియ్యువతిని దొంగలు యాక్షించి యామెను బలాత్కరించబోవ యామెమాంగళ్యమును దీసి యావలకు విసరిన యదియగ్నిబ్బటలెగయుచు దొంగలపైఁ బడి భస్మీ భూతులఁ జేసివైచెను. ఆమాంగల్యమును మెడయందు ధరించి నొక్క మహర్షియొద్దకుంజని నిలిచిన నామౌని దివ్యదృష్టి ని యామెసంగతి తెలంగెరింగిన వాడై నీప్రాణనాధుండగు చిత్రకరుండు మగధదేశంబు సురక్షితముగాఁ జేరిన వాడు. నీపతివ్రతాత్వముచే గొద్దిరోజులేగినత) యాతనిఁ జేరగలవు. అంత దనుక నాయాశ్రమంబున నుండుము. నీకుశుభంబు జేకూరునని యాన తిచ్చెను.

అచ్చట చిత్రకరుండు మగధనుజేరి దలిదండ్రులకుచాం ద్రాయణములో దానుసేవించిన దీర్ఘయాత్రలమహత్తును దేశాటనము ను పాటలీపురమున నొక రాజకన్యను ద్వాహమాడుటాది గాగలసం గతుల నెరింగించెను. ఆమెను యడవిపాల్జేసిన సంగతియు,గూడా నెరింగించెను. ఆమాటలు దలిదండ్రులు విన్నవారై యాతనిని సాధ్విని విడిచివచ్చెదవా యని గోపించిన వాఁడుయతి మతిభ్రమణ ముగలిగి పిచ్చివాఁడై తిరుగుచుండెను.

అంత నక్కడ ప్రభావతి యామునీంద్రుని చెంత గొంతకా లముండి మగధదేశంబునకేగ నుద్యుకురాలై సర్వాభరణములును యాతనిపాదసన్నిధిని సమర్పింపఁ బోయిన,, తల్లీ! నాకేల యీభూష ణంబులు. నీకువీనివలన యపాయంబునకు శంకించితివేని యీమంత్రం బులు యాపత్తునందు బఠించు" మని గొన్ని రక్షాబంధములును యుపదేశించి మగధకుఁ బంపెను.

అంత ప్రభావతియమ్మునిచే ననుజ్ఞాతురాలై యశ్వంబు నధి రోహించి మగధ పరి సరప్రాంతముల విడిచెను. అట్లుపోయి యా రాజ్యవృత్తాంతంబువిచారింపగా చిత్రకరునకు మతిభ్రమణముకలిగి నట్లునురాజ్యముశత్రురాజులవశమైనట్లును శత్రుణంబునభర్తపాదంబులును దిలోస్మరించి పంచాక్షరి నొక్కపర్యాయముస్మరించిన మాత్రంబునగజ తురగ పదాదులును. పరశుపట్టసశూలములును నీమెోరగన్సృష్టియయ్యె. ఆయుంచు సైన్యబలముతో శత్రురాజుల శిరంబులనురుమాడి, పురంబు లోనికిఁజొచ్చి చూడఁగా పట్టపురాజును. రాణియును కారాగారమునం దు గల వారిని విడిపించి వారికి సపర్యలు జేయుచుఁ దోడ్కొని వచ్చి నమస్కరించి నాథుని కౌఁగిట వీథివీథులుఁ దిరిగి నాథునిఁ బట్టుకొని పతివ్రతాత్వమహిమచే యానని మతిభ్రమణంబువదల్చి వివిధోపచా రంబులుచేసి యానినిఁ బట్టాభిషిక్తునిఁ జేసి దానురాజ్ఞియై చెక్కవేల సంవత్సరములు దేవేంద్రుని వైభవమంతయు వీరలనుభవింపుచు సుఖం బుండిరి.

కానసోతల్లులారా! అత్తమామల చిత్తంబులోనిడి, తల్లిదండ్రుల మాటలాలించి, పెద్దల సుద్దులవిని. నాథుని యాజ్ఞలమదియందిడి సంచరించిన ప్రభావతిని మించిన పెద్దలు మీరును కాగలరు.

ప్రభావతి చరిత్ర సంపూర్ణము.

# పుష్పవేణిచరిత్ర.

అఖిల దిగంతయుళో విశాలంబగు చోళదేశంబును దానికి ముఖ్యపట్ట ణంబగు గాంచీపురమును రాజనిధాగాఁ జేసుకొని పుష్పరథుండను నొక్కభూపాలవరుండు బరిపాలించుచుండెను. ఆతండు బిడ్డలులేక దద్దయుదవంబాచరింప శ్రీమత్కామాక్షీసహితుండగు యేకామ్రనాధుని పత్నీసమేతుండై గొలుచుచుండెను. అంతట నామేకామ్రనాధుండు వీరి భక్తికి మెచ్చి గోరుకొనుడు వరంబులిచ్చెదననుటయు నాపుణ్య దంపతులు పుత్రసంతతి దయసేయు మనుటయు నాదేవదేవులు మీాకు పుత్రసంతతి కలుగనేరదు. పుత్రికాసంతతి కలుగునని వరం బిచ్చి యథేచ్ఛం దిరోహితులైరి.

అట్లుఆకన్యక దినదిన ప్రవర్ధమానయై యుక్తవయస్క యగుట యునామెకు యుద్వాహంబుగావింప చిత్తమందు దలచినవాఁడై యారేంద్రుండు కుమార్తెవద్దకు వచ్చి దనయభిమతంబెరింగించుట యు ‟దండ్రీ! లోకంబునఁగల రాజకుమారుల చిత్రపులఁ దెప్పిం పుము అందున నాచిత్తము హత్తినవారను నే నేరుకొనిమెదను.అని నుపుటయు చిత్తరువుల దెప్పించు హడావిడిలో రాజుండెను. అంత గొనినాళ్ళకు సదానందు డనుమహర్షి రాజు సన్నిధికేగు దెంచి న నర్ఘ్యపాద్యాదివిధులచే బూజించి దక్షిణ దాంబూలాదుల కుమా ర్తెయుండు యంతిపురికనిపెను. అమ్మహర్షియు పుష్పవేణిసౌజన్యా దుల కచ్చెరు వంది యామెకిట్లు పతివ్రతాప్రభావముగ్గడించెను.

‟సుగుణభూషణీ! లోకమందునఁ గల సతులకు బతులే దైవ మూనులు. గానయేయువతి భర్తృసరసీరుహము లేమరక భజింపుచున్న

దో యాయమ త్రిలోకముల జయింపఁగల్గుచున్నది. అనసూయాత్రిమూ.
ర్తులఁ బాలకుల జేసినది. సుమతి సూర్యుఁడుదయింపకుండ జేసినది
ప్రభావతి నాథునిఁబ్రతికించినది. గాన పతి భక్తియే నిర్మలాను రక్తి."
యని యనేక పతివ్రతల ప్రభావంబుగ్గడించెను. అంత గొన్ని నాళ్లకు
రాజును గొన్ని దేశంబు లేలురాజులయొక్క చిత్రరువుల దెప్పించి కుమా
కర్తెడనుంచిన మాళవదేశపు రాజకుమారుని చిత్రపటము జూచి మో
మరపాంచెను. అది రాజు గ్రహించి మాళవదేశ ప్రభువునకు శుభలేక
బంపించిన నాడతండును కుమారునిజేరి యాతనితోనిట్లనియె,

"కుమారా! భూలోకంబునఁగల సుందరాంగులలో యీయమ్మ
లమిన్న మిగులసొగసుగనున్నది. ఈమెనువరించి యశంబార్జించు" మను
టయు నక్కుమారుం డిట్లుగ్గడించె.

"దండ్రీ! లోకంబున సాధ్వీమణులుండుటయరిది. యరిదియేయ
ననేల? వేరుగనుకనే యీశ్వరుఁడు జటాజూటమునందును, విష్ణువు వక్ష
మందును, బ్రహ్మవాక్కునందునుయుంచుకొనిరి. లోకంబునబతి వ్రతా
మణులున్న నీతిమూర్తులిట్లేల బెట్టుకొనియుందురు" అనిపాఁతనీతులు
పఠింపుచు నాకు వివాహంబక్కరలేదని నుడివె. అంతరాజును యీలేఖ
కుఁబ్రత్యుత్తరంబిచ్చి యాచారుననిపె. అంతరాజకుమారుండగు సుప్రి
కాశుండును, మంత్రిపుత్రుండగు సునీతియు దేశసంచారము బయలు
దేరి యడవిలోఁబరుండి నిద్రించుచుండిరి.

అట్లునిద్రించుచున్న రాకుమారునిఁగని నొక్కవిషోరగంబు నిప్పు
లుగ్రక్కుచు వచ్చుచున్న జూచి దానిని బాణంబుచే దెగవ్రేయనుం
కించిన యావ్రేటుదప్పి రాజపుత్రుని బ్రాణంబులు గొని యెటకేనిం
బోయెను.

ఇక్కడ శుప్రకాశుండు వివాహమాడక దేశమేగు వృత్తాంతమెరింగినదై యామెయుగొన్ని సైన్యంబులు దీసుకొనియాతనివృత్తాంతమారయుచుఁ బయలుదేరెను. అట్లుబయలుదేరి దిన్నగా యామంత్రికుమారుండు దుఃఖించుచున్న వటవృక్షమువద్దకువచ్చి యామెయు యయ్యోలక్ష్మణా ! యనియేడ్చుచుండెను. ఇంతకుముందేయేడ్చుచున్న మంత్రికుమారుండు యీయామెనీక్షించి యీయామెవృత్తాంతము సాకల్యముగా నెరింగినవాఁడై యనంతరకర్తవ్యమేమియని యామెనడిగెను. ఆమెయు నతనిచే చితిపేర్పించి యందుయాతనిశవమునిచి దానును సహగమనమునకుద్యుక్తురాలై భగవానునకు నమస్కరించి చితినెక్కెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు యీయామెపతిభక్తికిని, విశ్వాసశక్తికిని మెచ్చి ప్రత్యక్షమైరి. అట్లుప్రత్యక్షమైన పురాణపురుషులకు నమస్కరించితద్దయుమోక్షసామ్రాజ్యంబున కనుమతి నీయవేడెను.

అట్లువేడుచున్న సతినుపలక్షించి నీభక్తి మాకెంతయు బరమానందముఁగూర్చినది గాననీజీవితేశ్వరునే యిచ్చితిమి. పుచ్చుకొని సుఖముండుమని దిరోహితులైరి. నిద్రమేల్కాంచినవాని తెరంగున నానుప్రకాశుండు లేచి గడచిన కధయంతయువిని సంతసించెను.

తదనంతరంబు సుప్రకాశుండు, సునీతి, పుష్పవేణి, చోళదేశంబునకేగి పుష్పవేణి తలిదండ్రులచే దీవనలంది నొక్కసుముహూర్తము నిశ్చయించి యందు పటహకాహళధ్వనులతో పరమానందముగా వివాహముజరిగించెను.

అట్లుభీష్మించి వివాహము వద్దన్న వీరుఁడు పుష్పవేణిని నుద్వాహమాడుటయును, ఆమెచే దనప్రాణ రక్షణోద్యోగంబు జేయించుకొనుటయును విని సుప్రకాశుని దలిదండ్రులు యతి యానందించి కోడలి

ని యక్కునంజేర్చి యత్తగారును అల్లుని అక్కునం జేర్చుకొని మామ గారును యతి ముదంబున రెండురాజ్యములకును రాజుగాజేసి రాజ్యం బప్పగించి సుఖంబుండిరి.

నిశ్చలమానసయు, దృఢసంకల్పయు, ప్రతిజ్ఞాపాలయునై భర్త కుప్రాణంబు లొసంగి, త్రిమూర్తుల దర్శనముఁజేసి యత్తమామలచే మెన్నరాని మన్ననలందుట యేభక్తిచేతనో యాంధ్రమతల్లులు జ్ఞాప కముంచుకొనెదరుగాక !

పుష్పవేణి చరిత్రి సంపూర్ణము.



# సుముఖి చరిత్రం.



త్రోల్లిసింహపురికిఁ బశ్చిమంబున కుమ్మరపల్లెయను నొక్కపల్లె యుండెను. అందు శుద్ధ సాంధుడను నొక్క కుమ్మరియుండెను. అతని ముసలితనంబు వచ్చునంతదనుక సంతానభాగ్యములేక ముసలిప్రాయం బులో నొక్కకుమార్తె జనియించెను. దానివక్షస్థలంబున శోభనరేక యుండుటంబట్టి యామెకును సుముఖియను నామకరణముంచెను. ఆబిడ్డ లేకలేక యుద్భవించిన దగుటచే మిక్కిలి గారాభముగా పెంచు చుండెను. ఇట్లుండగా నామెతల్లి స్వర్గస్థురాలగుటయు దండ్రికడనే పెరు

ద్ధయిన్నామెయై పొద్దుబుచ్చుచుండెను. ఎప్పుడును నాటపాటలుగాని వినోదకరంబులగు నింకొక పనులుగాని యామెయెప్పుడును జేసియెరుం గదు. అఖరుదియగు ముదిమిప్రాయంబున నుద్భవించెదగుట యీమె కెవ్వని వరునిగాఁగూర్తునా యిటువంటి శుద్ధముద్దు నెవ్వఁడంగీకరించునా యని యోచించుచు నీమెచింతచేతనే జెంగగొని వివాహాన్వేషణము జే యుచుండెను. దనకుఁదగ్గర చుట్టమువలో నొక్కనినిఁబిలిచి యాతనికా కన్యనిచ్చి వివాహంబొనరించెను. ఆతనిపేరు మందప్రజ్ఞుఁడు ఆయమకుఁ దగిన ముద్దబ్బాయియీయన. ఆమందప్రజ్ఞుని కుమారునిగా భావించి యాతని యింటనిడుకొని సాఁకుచుండెను. అట్లుండగా గొన్నిదినంబులకు బుద్ధసాంధుండు పరలోక గతుడాయెను. అంతట సుముఖ భర్తయగు మందప్రజ్ఞుఁడు మామగారికుత్తరక్రియలొనర్చి భార్యంగాంచి ,,యోసీ! మీతండ్రి యున్నంతవరకు మనకే విచారమును గాన్పింపక ఆతఁడుమన దురదృష్ట వశమున స్వర్గంబు జూరగొనెను రేపటినుండి నీవు మనబంధు వులతోడఁగూడి మన్ను గంపదెచ్చితివేని యామన్నుతోఁ గుండలుచేసి బదుగురకు విక్రయించి గాలంబు గడపుదమని యాజ్ఞాపించిన భర్తయగు మందప్రజ్ఞుని మాటలాలించి యామెయు బంధువులతోడఁగూడి యేటి కిఁజని జిగటమన్ను గంపనిండుగా యెత్తుకొని గృహంబుజేరె. అట్లుదిన దినము దెచ్చుచు నొక్కనాడు మోయలేక దారియందు గంపనుబడ వైచి యచ్యేడం గూర్చుండి యిట్లుతపింపసాగె.

,,ఓయీశ్వరా! పరమేశ్వరా! సర్వమానవులను సమదృష్టినీక్షిం చునీకు యణువుమొదలు మేరుపర్వతము వరకు నొక్కటియేగదా! అ ట్టిమెదనాకీదిక్కు లెందులకుంచితివి. రక్షింప శిక్షింపయర్హుండవుగావా యనాధను ఈమట్టిపోకున్న నామనోనాధుని పనిజరుగదే! బంధువులారా! మువరియిండ్లకు వారు జనిరి. మోసుకొని పోవుదమన్న మోయుశేకుం

టో”నని వాపోవుచుండు సమయంబున నాదారినిగౌతమమహర్షి వచ్చియి య్యువిదంగాంచి ‹‹అమ్మా! యేటికిట్లు యేడ్చుచున్నావు. నీకుమూడి నయాపద నాకెరింగించుము. నాకుసాధ్యమగునేని దొలగించెదను. అసా ధ్యంబగునేని దొలంగు యుపాయంబు జెప్పిపోయెదను. ఎట్టిదైనను జెప్ప కతప్పద”ని పెద్దపట్టుపట్టుటయు నాపరమసాధ్వి యిట్లు యెరింగించెను.

‹‹తండ్రీ! నాపుర్వాకృత సంచిదార్థమెట్టిదో! నేనొకకుమ్మరయు వతిని. దండ్రియున్నప్పుడు సుఖంబుగా బెరిగిన దాననగుటనేడు నాదం డ్రి గతించుటంజేసి యీమట్టిగంప మోయలేక, చేయునదిలేక, గడచు విధముగానక, దుఃఖించుచుంటిని ఇదినాసంగతి. మీరుపకారంబు జేసె దనని వాగ్దత్తమాచరించితిరి. గావునకలతెరంగంతయు మీతోనుడివితిని. దయయుంచిదానికి సాదనోపాయంబున్న తెలుపుం” దనిమిన్నకుండెను. అంతనాగౌతముడు ‹‹తల్లీ! సుగుణములకల్పవల్లీ! తొల్లినీవు తొలిజా మునసే మేల్కాంచి మహనీయులగు మునిశ్రేష్టులకు యపచారంబులు జేసితివి, అట్లుజేసియు వారివలన సాఫల్యంబులగు వరంబులనర్థించక కాలంబుగడపితివి. అందునే నికిట్టిసికృష్టమగుజన్మ లభించినది. ఇందుబ డరాని యిక్కట్లు బడుచుంటివి. కాననేటినుండి పంచాక్షరీమంత్రమును బఠనజేయుచు భర్త పాదారవిందములను డెందంబునస్మరింపుచుయుండు వేని నీకు శుభంబులు చేకూరగలవు. పొ”మ్మనుటయు నమ్మగువలేచి యాగంపనెత్తుకొని దలపైనిడుకొని భర్తసాన్నిధ్యమున కేతెంచెను. అట్లువచ్చి భర్తకి తెరంగంతయు నెరిగించి నాటినుండి పతిపాద సరసీరు హమ్ములేగతియని యతిగా యాతనిని నియతిదప్పక బూజించుచుండెను. షడ్రసోపేతంబులగు పక్వాన్నములవండి భర్తకొసంగింపంజేసిభర్త శేష మును దానారగించుచు ముద్దమ్మాయి పెద్దమ్మాయియై గాలంబుగ డపుచుండె. పతియాజ్ఞానుసారము రేపకడలేచి బంకమట్టి దీసుకొనివచ్చి

పతిభాండమ్ములు నిర్మించులోపల గృహకృత్యములు నెరవేర్చి యతని భాండంబులు పూర్తి కాగానే మూపుపిడకలుంచి దనపతివ్రతా ప్రభావాగ్నిచే యావను రగుల్కొల్పి వాటినిగాల్చి యూరిలోనికి అమ్మకమునకై గొనిపోయి వాటినమ్మి సొమ్ము దెచ్చుకొని సత్యంబుదప్పక మందప్రజ్ఞునితో గాలంబు గడపుచుండెను.

ఒక్కనాడు యప్పటియట్ల అమ్మలక్కలతోఁ గలసి మన్నునకై జనగా పెన్నేరు ప్రవాహంబడ్డమై వీరలుబోవుటకు వాఁలేక ప్రవాహంబతివేగముగాఁ బరుగిడుచుండిన కుమ్మరస్త్రీలందరును విచారగ్రస్తులై యోయక్కలారా! యింటికి బోవుదము మాయదారి మొగముయేమొగము జూచితిమో ప్రొద్దుటనేలేదియని యనుకొనుచు వెనుకకు యింటిమార్గము బట్టిరి. అప్పుడు సుముఖి ముందునకరుదెంచి ,,యమ్మలారా! నేనీప్రవాహమునుండియే పోయెదను. మీరునన్ను వెంబడించుడ"ని ప్రవాహంబున దిగిదిగుటతోడనే ప్రవాహంబు రెండుపాయలగుటయు వారలంతా యతిసంతోషా క్రాంతచిత్తులై సుముఖి ప్రభావము వేనోళ్ళఁజాటుచు జంకమన్నునుదీసుకొని యూరిలోనికివచ్చిరి. అట్లువచ్చియామెప్రభావంబు యూరంతయునుగ్గడించుటయు, నది యానోట యానోటయామాట యూరంతయు యంతఃపురంబువరకు జరిగెను. ఈమాట వినియాయూరి పెద్దశెట్టి నొక్క దనభార్యను బిలిచి సుముఖి యెంతటిదాయెనే? దానికీర్తి వల్లిక యెంతవరకుఁ బ్రాకినది. నీవుపోయి సుముఖితో దేవుని సందర్శనము చేసి వద్దామురమ్మని బిలుచుకురమ్ము. పొమ్మని దనపతిని బంపించి యేమిచేసుకోవచ్చునోయని నిరీక్షించుచుండెను. ఆమెయుపోయి దేవాలయంబున కేగుదము రమ్మని పిలువగా నాతన్వి నాదేవుండింటనేయున్నాడు నేను రాన" ని నిరాకరించుటయు యామెయువచ్చి కడచినవృత్తాంతము భర్తకెరింగించి జనియెను.

అట్లుండగా మఱియొకనాఁడు యాయూరిరాజామెను బరీక్షింప గోరిదవభటులం గొందఱరావించి సుముఖుగుడిసెనుగాల్చిరండనిపంపెను. వారునురాజాజ్ఞకు మారాడక యాగుడిసెకగ్గిదగిలించి వచ్చిరి. అంతనా దంపతులుమేల్కాంచి మందబుద్ధిగలవాడుమందప్రజ్ఞుడగుటవలన గొల్లు నగోలయెత్తెను. ఆమెయునాథునివారించి పంచాక్షరినొక్కసారి పఠించి నాథునిస్మరించినంతనే మెడతెరసి వర్షమేకధారగా గురిపి యాగుడిసెకంటిందిన యగ్ని యారిపోయెను. రాజీకార్యమునుజూచి యాశ్చర్యపడి యట్టెనిలచి పోయెను.

తదనంతరము గొన్నినాళ్లకు వాడుకప్రకారము సుముఖగంపలో గుండలనిడి నెత్తిపై నెత్తుకొని వచ్చుచుండగా యాగంపయామెనెత్తికందక పైపై వచ్చుటమంత్రి, రాజు మొదలగువారు జూచి యాశ్చర్యపడి మంత్రితోనిట్లనియె, మంత్రీ! దీనిప్రభావము మనముపక్కగా బరీక్షించవలెనని ప్రతిదినమును రెండుజాములన్నరకు భర్తకు వంటకము చేసి వడ్డించును, రేపటిదినము కుండలు భట్టలు వచ్చుతఱిరాణిచే నీమెకు యాపించి పొద్దుగడచునట్లుచేయువలెను. అప్పుడిది యేమిచేయునో చూచెదముగాక! యని వారలాలోచించి యావూట కామెను వకలి మరుచటిదినము యామె యమ్మరాగా రాణిచే కుండలుగొనిపించి యాకలియ్యక జాలమునేయించుచు బొద్దుపుచ్చుచుండిరి. ఆమెగొంతసేపు నీపతివ్రతామహాత్వమును వెల్లడించుమనియు యేవేవియో పాటలుపన్ని నీమెను నట్లెయుంచివేసిరి. ఈమెయుదేవియో పద్మవ్యూహమనిమదినెంచి సూర్యుడు రెండుజాములన్నరతికే పోవునట్లును,యంతకుమించి పోగూడదనియు యానయిచ్చి యట్లెనిలిచి యుండెను. రాజు ఘటికాయంత్రము దగ్గరనిడుకొని వేళ యతిక్రమించుటయెఱింగి యీవలకువచ్చి చూడగా దివాకరుడు రెండుఝాములప్రొద్దుయుండు చోటనేయుండెను. అంతరాజు యామెపతివ్రతా

మాహాత్మ్యమునకు మెచ్చుకొని మణిమయాలంకృతంబగు పల్లకినెక్కిం చి యూరంతయు నూరేగించి, యామెయింటికి దోడ్కొనిజని మం ద్రప్రజ్ఞని కౌగిలించుకొని యనేక విధంబులగొని యాడవారికి నిత్య జీవనోపాధికి సరిపోవు యగ్రహారంబులిచ్చి యాదరించె. అంత నాసు ముఖి పెద్దకాలంబు మందప్రజ్ఞుంగూడి సుఖంబుండె.

వర్ణమునచిన్న. గుణమునపెద్ద. మహిమంబులనంతములు. మర్యా దమొందు? ఏభక్తిచేత యువియులవడినవో మదినిడి యాచరించి మర్యా దసులుగందు.

సుముఖి చరిత్ర సంపూర్ణము.

సర్వంబును

సంపూర్ణము



# ఆంధ్ర నాటకములు.

## రోషనార

కర్త: కొప్పరపు సుబ్బారావుగారు.

ఏరాజును మహారాష్ట్రమంత తనగర్భంబున గని ధన్యమయ్యెనో, ఏమహారాజునకు ఛత్రాధిపత్యము నిలుచుటకు తగినతావయ్యెనో, ఏసార్వభౌముని పేరు వినినంతనే మొగలాయిసామ్రాజ్య మరూపితలూగినదో, ఏమహామహునికీర్తి దిక్తటములు పిక్కటిల్ల పగతురకు పక్కలో నిక్కబల్లెమయ్యెనో, ఏమహాత్ముడు యేకపత్నీవ్రతమును నిత్యమును జరిపెనో ఏరాజు దురంతములొనర్చు ముష్కరులకు గంటకుడై నెగడెనో అట్టిశివాజీచరిత్ర మీరోషనార. అతిసౌందర్యవంతురాలై అనేకమంది తన కరిగాపుడై తనయండనుండ శివాజీనేకోరి, మోహమొలకను బడయజాలక నానాబాధ లనుభవించి పంతగించి కాలి నడకనే మహాటవులలో నడకసాగించి, శివాజీతో యుద్ధంబునకుదలపడి, తనమనోభీష్టము నెరవేరకునికి మహారాష్ట్రదేశమందే మరణశయ్యనెక్కి, గుర్రెక్కుడుప్రాణము తనను వీడుచున్ననుగూడా శివాజీయందుండు ప్రేమను వీడజాలక, కడకు ప్రాణమువీడెనో అట్టివీరనారి రోషనారచరిత్రమున్ను గలిసి నాటకరూపముగా వ్రాయఁబడిన నాణ్యములగని యీరోషనార. ఎందరెందరో రాజులు పరిపాలించి అందలేనికీర్తి చంద్రికను తానదేకయుద్ధములలో జయమొంది సంపాదించి యుంచి మించిన దీశివాజీచరిత్రమే. అనేకనాటకకంపెనీలవారిచే నాడబడి యెన్నోకూర్పులచ్చొత్తింపబడి ప్రతులైపోయిన దీరోషనారయే.

దీని వెల రు 1—0—0

## అనసూయ

(అయిదంకముల నాటకము.)

సుమతీ, అనసూయ సతీమణుల పాతివ్రత్యప్రభావము చక్కగ హృదయరంజకముగ వ్రాయబడినది. వేశ్య చెప్పిననీతులు వినితీరవలెను. నారదుని కలహాసంధానమే నాటకమునకు మూలసూత్రము నారదుడే కథానాయకుడు.

వెల రు 0—12—0

శైలిగోక పద్యమును పొందుపరచితిమి.

సీ. శత్రువర్గము నలక్ష్యంబుగఁ జూచుచో
స్వారాజ్య మేల చేపడదు మీకు ?
పరమధర్మం బనబందు నహింసవలన
స్వారాజ్య మేల చేపడదు మీకు ?
జాతీయధర్మ పోషణ మొనరించిన
స్వారాజ్య మేల చేపడదు మీకు ?
మద్యపానాది దౌర్మార్గ్యంబు లుడిగిన
స్వారాజ్య మేల చేపడదు మీకు ?
గీ. అధికగర్వాంధతను స్వప్నమైనవేల్పు
దొరలుకొను హవిర్భాగముల్ దొరలునీకు
డాత్మశక్తికి స్వాతంత్ర్యమందజేసి
యవనిమాతను గొల్వుడీ యార్యులారా !

## సంగీత శశిరేఖ

గ్రంథకర్త:—అయినాపురపు సోమేశ్వరరావు పంతులుగారు.

శశిరేఖ చాలమందిదే. అభిమన్యుని ఆలాపములు అయ్యాయగు బలరాము నొద్ద పనికి వచ్చినవి కావు. సుభద్ర శోద్స్సాయినను సుంతయు కరగించలేకపోయెను. కృష్ణుని బుజ్జగింపు మట్టిపాల్జేసెను. దట్టమగు రేవతి బోధనలు తుదకు పనికిరావయ్యెను. దేవకి ప్రాధేయము దిగుడు బావులయందు చెలాయించుచుండెను. ఇంక దిక్కులేక అడవుల ద్రిమ్మరుచున్న మన అభిమన్యుని ఘనభీకరాకారావాసంబులో ఘటోత్కచుఁడు దాకి, చెట్టుపుట్టా నేల కొరుగ, ధైర్యముతో నరాతివీరజన కంఠలుంఠనము చేయగలిగిన ఖడ్గములతో నారదుని మేల్కొల్పి భావగీతమొక్కటి పాడింపజేసి, అన్నదమ్ములుగా నెరిఁగి అక్క చెల్లెండ్రను

కలిపి ద్వారకానగరంబునకేగిన ఘటోత్కచు నొక్కసారి జూచినంతనే కడుపు వ్రక్కలగును. లక్ష్మణుఁగట్టు. దుర్యోధనునిబెట్టు, బలరాముని పట్టు, కృష్ణుని గుట్టు, నొక్క నాగామాయను చేసి, కర్ణునిగొట్టి, హాలాయుధుదిట్టి తాను మాయాశశిరేఖరూపముదాల్చి చరించిన ఘట్టమతివిచిత్రము. సంఘదురాచారములను నిందించుచు శశిరేఖ చెప్పిన నీతులు యొప్పులకుప్పలు, జలరాజు భీమునే పరిహాసము సంచరించువారికి ముప్పతిప్పలు. అనురాగముతోఁ పెడ్లియాడ్యాకేగాని అమ్మకక్కరలేనుట రేవతిమార్గము. ధనాశాపరులల్లే దాఁటియుచు ముద్దుబిడ్డలేద్వ తాము నరదాగా నుండుట చాలా వాపోవని తననుని మనశశిరేఖ చెప్పకపోదు చక్కని పాంగ్సులతో నలరారుచున్నది. వెల 0—12—0

# సంగీత సావిత్రి

అయినాపురపు సోమేశ్వరరాయకవి కృతము.

సావిత్రి సకలమానవ నారీమణులలోశిరోమణి, భర్తకు రానున్న యాపదలను బాపుటలో మేలుమణి, సద్గుణములలో సుగుణఖని, యమునిబాధ లోర్చుటకు సాధుసంపన్మణి, నిజతపోమహిమచే నాథుని బ్రతికించి, నారదుడు వలదని చెప్పినను వినక తల్లిదండ్రుల మాటలు నరకుగొనక, తాను వరించిన వానినేదక్క యన్యుని ప్రేమింప నొల్లని విషయమునందు సతీమణి, నాథుడెంత దరిద్రుడైనను, తానెంత సంపన్నుని పుత్రికయైనను, అష్టకష్టములు రానున్నను హెచ్చువదవి పోనున్నను జంకుగొంకు లెరుంగని సాధ్వీమణి, భర్తకు రానున్న ఆపదనుబాపి, పోయినరాజ్యమును రప్పించుటలో వీరనారీమణియైన ఈ యమచరిత్ర మొక నాటకరూపముగా వ్రాయబడి చక్కని పాంగ్సులతో నలరారుచున్నది.

దీని వెల 0—12—0

# సంగీత శ్రీకృష్ణలీల.

ఇందు శ్రీకృష్ణుని జననము కంసవధ ఉలూకబంధనము కాళింగ మర్దనము పూతనసంహారము శకటాసురభంజనము హయమణిగ్రీవుల శాపవిమోచనము గోపికావస్త్రాపహరణము విశ్వరూపసందర్శనము గోవర్ధనోద్ధరణము ధేనుకాసురవధ మొదలగు పెక్కువిషయములతో సాంగ్ఫనహో వ్రాయబడిన చక్కని నాటకము. వెల రు. 1—0—0

# రాణాప్రతాపసింగు.

(శతావధాని వేదుల సత్యనారాయణశాస్త్రి, సాహితీసమితి)

5 అంకములనాటకము! 3½ గంటలలోఁ బ్రదర్శింపవీలైనది!!

శైలిమృదుమధురము-రచననూతనము- ఇతిహాసకల్పనము-రంగోచితము-పద్యములు స్వాతంత్ర్యదుంకుభులు- దేశభక్త్యుజ్జీవకములు-ఇందు కానిసతనమునందలి నైచ్యము-స్వాతంత్ర్యమందలి మహోత్కృష్టత-చక్కగా వెల్లడింపఁబడినవి. దేశభక్తి-ధైర్యము-పౌరుషము-స్వేచ్ఛాభిలాష- సాహసశౌర్యములు మొదలగు మహోద్గుణములుగల్గి యిరువదేండ్లు యుద్ధముచేసి దేశమునకు స్వాతంత్ర్యమార్జించిన రాజపుత్రవీరుడగు ప్రతాపునిచరిత్ర మిందు సంపూర్ణముగా వర్ణింపఁబడినది- రాజమానసింహుని పట్టుదల-తారోడుచోండావతుల శౌర్యము-పృథ్వీరాజకవీంద్రుని స్వేచ్ఛాగానము-అక్బరుచక్రవర్తి యౌదార్యము-రాజనీతి నిపుణత-హైందవసౌదర్యము-హిందూమహమ్మదీయమైత్రిచే దేశమునకు గలుగుమేలు-విపులముగా వివరింపఁబడినవి. నాటకమంతయు స్వేచ్ఛాగానమే-నాయికయగు పాటేశ్వరీదేవి పతిభక్తి-దేశభక్తి చదివితీరవలయును. తేజసింగువుష్పకుమారుల ప్రేమవాహిని పొంగి పొరలుచున్నది.

దీనివెల రు. 1—0—0

# కాలసర్పము

(పరిశోధకనవల)

గ్రంథకర్త:—అయినాపురపు సోమేశ్వరరావుగారు.

నీకొంపగూల ! తోకత్రొక్కకోయి బాబు!

కాలసర్పము కదలినదంటే కంగారులేక నేకార్యములు నెరవేర్పగలము? మంతనములో మామగారిహత్య-చింతనములో చిరుతవాని చంపుటకుద్దేశ్యము-బాలప్రాయమునుండియు తన్నెరిగినమరదిగారికి శిరఃఖండనము-సుభద్రకు కారాగారనివాసము-తదివిటునకుమందహాసము-హత్య హత్యలో-హత్య-ఒక్కసారిగాఅయిదుహత్యలు-శిక్షింపదగినవారెవరు? దొంగదొరికినగదా శిక్షించుటకు-"ఇంటిదొంగను బట్టుటకు ఈశ్వరునికైనను తరమగునా?" నిటలాక్షునకే మించిన ఈకార్యము మనరాజారావు చేతిలో మారణహోమము పేర్చవలెను-సుభద్రనుక్షించవలెను. అబ్బా ! భయముగొల్పుచున్నదీ పాయుశిగుహ! అయ్యయ్యో! కాలు చిక్కుకున్నదే! ఈకన్నములో-ఎంతవాడవురా దొంగా! మారాజారావునుమాత్రము చంపకుమా! క్షణములో శ్యామలా! భీకరకాలాంధకారమధ్యమున చంద్రహాసము చేబూని రాజారావు నెదుర్కొన్నది. రాజారావు దృఢబాహువులలో చంద్రహాసము మెరపుజూపినది. తుది కారిఘూర్ణితమహోహంకారముతోడ శ్యామలా అపరశారదవ్యక్తి కార్యరంగమున పురుషవేషముతో బ్రవేశించి కాలసర్పమువలెకరవాలమును విసరి కాలికి బుద్ధిచెప్పినది. కుటుంబవిచ్ఛేదనశీలయగు నీనారీరూపవైరవి నడక గాక పరుగుతో పల్లెటూళ్లుదాట ప్రయత్నించినది. పాపముబ్రద్దలయ్యెను. ఒడిలో చంద్రహాసముగల ఈమె-ముఖమున మందహాసముండుట చూచువారలకతి సుబ్రకాంతిశేషియగు యీమె-అంతర్గతమును నింతకుటిలత్వముండుట చూచి చదువరులగుండెలు తల్లడించు

వేళ తనఖడ్గముచే బొడుచుకొని మరణించిన శారదను చూడవలసినదే ! లక్ష్మణసింగుకొరకా ఈరాద్ధాంతమంతయు-సకలజనానందముతో - కుమారమాధవుని కుసలము-సుభద్రి సుఖము-అన్నపూర్ణ యుద్వాహము యుక్తిపరియుక్తులతో సంచరించిన రాజారావునకు రాజులచే మర్యాదతో కథామంగళరంగము బసినమాప్తమాయెను. కాన నోచదువరీ! కాలసర్పము నొక్కదానిని తెప్పించుకొనుము. వెల రు. 1—0—0

# తెనాలి రామకృష్ణకవి చరిత్ర

గ్రంథకర్త:—మలకపల్లి పెదశేషగిరిరావుగారు

ఆర్యావర్తనభూమియందు అవతరించిన మహాకవులలో తెనాలి రామకృష్ణు డొకడని పైపేరు చదివినతోడనే పాఠకులకు తెలియకపోదు. తన అనర్గళఆశుధారాప్రభావంబున శ్రీకృష్ణదేవరాయల మెప్పించిన మేటి- హాస్యరసంబున అతనిపటుత్వ మెవ్వరికిని రాని కవితాప్రచండుడు. నిరుపమానమైన తన కవిత్వముచేత సహజధోరణిచేత కాళిని కంగారు పెట్టిన కవితాపితామహుడు. స్వతంత్రకవితామండపప్రదీపుడు. నరాతి వీరుల దునిమాడిన మహావీరునైనను దన కృపాణంబును హాస్యరసంబుచే నణుచు కవితావతంసుడు. ఏమహారసము సర్వోత్కృష్టమై సమస్తజనులకు ఆహ్లాదజనకంబో అట్టి హాస్యరసంబునకు వన్నెవెట్టిన కవిశిఖామణి. అష్టదిగ్గజంబులని పేర్వడసి రాయలాస్థానము నాక్రమించిన దిగ్గజంబుల కవితామొగ్గరంబున గెల్చిన పాండురంగ కావ్యనిర్మాత తాతాచార్యుల తినవ్యూహ ప్రపంచములో నుఱ్ఱూట లూగించిన రామకృష్ణున శంకరకవిని భావనా వీధిలో బట్ట బయటనుంచిన కవిసార్వభౌముడు ఏరసంబు పేర్వెన్న శోకాకులిత చిత్తులైనను వకృష్ణ నవ్వుదురో ఏరసంబుచే సర్వజనమాన నాహ్లాదంబు

కలుగునో వీరసంబు సకలదుఃఖముల పటాపంచలొనర్చు యామవతంబి వీరసంబుచే మహారాజా మొదలు మాలవానివఱకు సంతసాం బోధినోలలాడుదురో అట్టిహాస్యరసంబును కుప్పతిప్పలుగా గుప్పించి కవిరాజు. అట్టిమన ఆంధ్రకవి చరిత్రమును నొకమారువినరా? చదివి ఆనందించరా? వినువారికి ఆనందపరుపరా? పండితులనుగాయుతు పామరునివరకు వికటకవి పేరు చెప్పినంతనే ఏమికథలకు యాజ్ఞయిచ్చుచున్నారో యట్టి మన పండితప్రకాండుని కథఁగూర్చియు కథలను పలుకించుమనియు వేరుగ చెప్పవలెనా? సోదరా! నేడేవక కార్డు వ్రాయుము. పుస్తకమును బడయుము. తోడివారల నాన దవరుఫున నీకొక్క రూపాయి ఖర్చుతో నీ వారందరును సంతోషాబ్ధి నోలలాడుదురని మొరుంగుము. వెల 1—0—0

## శ్రీకృష్ణదేవరాయచరిత్రము.

వెల రు. 1—0—0

## అగ్గిరాముడు.

(రామక్రియము)

జిల్లానంతయు గగ్గోలుపెట్టి జనాధికారుల కన్నమోసారులు ప్రత్యక్షమగుచు, మోసపుచ్చి తనకు రెండుభుజములనదగు దొంగరాముడు, బలేరాముడు, అనువారింతో నీదొంగ యొనర్చిన సాహసములు వర్ణింపనలవికాదు అగ్గిరాముని పేరును ఈతని సాహసకృత్యములను విననివారుండరు. సుమారు కొన్ని సంవత్సరములకు పూర్వము జిల్లాలో అగ్గిరాముడొనర్చిన చర్యల నాశాలగోలాలము గాథలక్రింద చెప్పుకొనెడివారు కాని యిపుడెచ్చటను మనుష్యులకు ఎంతమాత్రము

పొందికలిగించలేదు. నీచకృత్యములు లోనర్చినను అగ్గిరాముని మేధాశక్తి శరీరపాటవమునకు అక్కఱపడనివారుందరు. ఇంగ్లీషుభాషలో వ్రాయబడిన పరిశోధకగాథల ననుసరించి వ్రాయబడినది. వెల 0–12–0

# నవరత్న సంజీవి.

నవరత్నసంజీవి యంటే:—నాణ్యములగనినుండి మానవులకొఱకు శుద్ధించిదీసిన మహౌషధరాజము. పిల్లలముద్దుమాటగట్టు ముక్కలకు బొక్కలు బొడిపించి కంగారుచేతురు. ఆకంగారంతయు నీరంగారు నవరత్నసంజీవి రాసిన సంగతి గనుగొనెతీరును. రక్తము స్రవించదు. చీముపట్టదు సున్నమవసరములేదు ! అదియిదియననేల గాయములకు గండ్రగొడ్డలి, తేలుబాధ తెగటార్చు వజ్రము తామరను ధ్వంసముచేయు తాపసి, కాలిన గాయములకు విధించు కఠినశిక్ష. నోరులేని డాక్టరు. ఊరులేనిరాజు. పదును లేనికత్తి. జోడులేనిరౌతు. ప్రాణములేని పోరాటము. చురుకుగల శూరుడు. రోగంబుల జయించినవీరుడు. హనుమంతుడు గొనితెచ్చిన సంజీవికన్న ఎనిమిదిరెట్లెక్కువ పనిజేయగలిగినది గనుకనే ,,నవరత్నసంజీవి" యైనది. ఆసేతుహిమాచలపర్యంతము యందందరువాడవలసినదే. తత్వభేదంబులు దీనికక్కరదు. ఖరీదు 0–4–0 వాడువిధము మందుతో వుంటుంది.

నవరత్న సంజీవి అండు కంపెనీ,
వీరేశలింగం హైస్కూలురోడ్,
ఇన్నీసుపేట, రాజమండ్రి.

సన్ లైటు బుక్కుడిపో, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

# అనసూయ

(అయిదంకముల నాటకము)

సుమతి, అనసూయ పతివ్రతల పాతివ్రత్యప్రభావము చక్కగ హృదయరంజకముగ వ్రాయబడినది. వేశ్య చెప్పిన నీతులు బంగారువలెను. నారదుని కలహసంధానము నాటకమునకు మూలసూత్రము. నారదుడే కథానాయకుడు.

వెల రు 1—0—0

కైలి రోశ పద్యమును పొందుపరచితిమి

సీ. శత్రువర్గము వలత్స్యంబుగఁజూచుచో
స్వారాజ్య మేల చేపడదు మాకు!
పరమ ధర్మంబనంబను సహింపవలన
స్వారాజ్య మేల చేపడదు మాకు!
జాతీయధర్మపోషణ కొనరించిన
స్వారాజ్య మేల చేపడదు మాకు!
మద్యపానాది దౌర్భాగ్యంబు లుడిగిన
స్వారాజ్య మేల చేపడదు మాకు!

గీ. అధికగర్వాంధకము నష్టమైన వేల్పు
దొరలుకొను పాదిర్భాగముల్ దొరలనీక
దాస్యవిముక్తి స్వాతంత్ర్యమందజేసి
యవని మాతను గొల్వుడీ యార్యులార;

వలయువారు:—వజ్రశైటి బుక్కుడిపో, రాజమండ్రి.

